# బుద్ధిశాలి

[కథల సంపుటి]

రచన

ధనికొండ హనుమంతరావు

1947

ప్రచురణ

సుందరరాం అండ్ సన్సు తెనాలి

సోల్ డిస్ట్రిబ్యూటర్సు

**శేషు అండ్ కో., తెనాలి**

# బుద్ధిశాలి

"ఊళ్ళో దొంగల హడావిడి యెక్కువగా వున్నట్టుందే?" అన్నాడు గోపాలం.

"మొన్న మావీధిలో డాక్టర్‌గారింట్లో మూడువేల రూపాయల విలువగల వస్తువుల్ని దొంగిలించారు." అన్నాడు, దాసు.

"ఆ డాబా ఇంట్లో యెలా ప్రవేశించారూ?" అన్నాడు శేషు.

"అదే వాళ్ళ చాకచక్యం. ఆ కీలకం తెలుసుకోగలిగిన ప్రతివాడూ దొంగయేందుకే ప్రయత్నిస్తాడు. యెందుకంటే ఆరేసి నెల్లకొక రాత్రి వంతున పనిచేస్తే చాలు!"

"దొంగలంటే జ్ఞాపకం వచ్చింది. మూడేళ్ళక్రితం ఏలూరులో వుండగా .... యెండాకాలం ఆరుబైట పడుకున్నాం. అర్ధరాత్రి ఇంటికప్పులో చప్పుడైతే, బద్ధకంగా వుండికూడా లేచి చూద్దామనుకుంటూండంగా పిల్లివొకటి పైనుంచి దూకింది. వెధవపిల్లిని తిట్టుకుంటూ హాయిగా నిద్రపొయ్యాను. తెల్లారేసరికల్లా కప్పులో అమర్చబడ్డ పెద్ద వెంటిలేటర్ ప్రత్యక్షమైంది. దాని కూలికిగాను వెయ్యి రూపాయల తెలుపూ పసుపూ లోహాలు యిచ్చుకోవాల్సి వొచ్చింది ...."

"ఆ మాటకొస్తే .... ఐదేళ్ళనాడు బాపట్లలో వుంటూండగా బైట జోరుగా గాలీ కుంభవర్షమూను! దొంగ ఎంత

సేపట్నించి ఆ గాలివానలో కాపలా కూర్చుని వున్నాడో తెలియదు. మాఆవిడ దొడ్డితలుపు తెరిచి అవతలికి వెళ్ళి వచ్చేలోపల, వంటింట్లో నుంచి లోన ప్రవేశించి వుంటాడు. ఆమెకు బాగా నిద్ర పట్టాక సామాను సర్దటం మొదలు పెట్టాడు. ఖరీదైన చిన్నవస్తువులన్నీ నా లెదర్ సూట్‌కేసు లోకి సర్దుకొని, తడిసి ముద్దయిన వాడి బట్టల్ని విడిచేసి, యిస్త్రీ బట్టలు కట్టుకొని - మిగిలిందేమన్నా వుంటే తన తరువాతివాడికోసం వీలుగా వుండేట్టు వాకిటి తలుపు భార్లగా తెరిచి-రంగేళీ రాజల్లే వుడాయించాడు. మధ్యలో నా కొకసారి మెలుకువ వొచ్చిందికాని లైటుఆర్పేసి వుండ డంవల్ల—బహుశా గాలికి పోయి వుంటుందని—ఒత్తిగిలి ఇంకా వెచ్చగా వుండేందుకు రగ్గు పైదాకా లాక్కుని పడు కున్నాను.... ....”

“పోలీసు రిపోర్టు చెయ్యాలా?”

“ఏం లాభం? కేసు రిజిస్టరు చేసుకోవటం వరకే వాళ్ళ సహాయం; తరువాత వస్తువు లేమన్నా దొరుకుతే కేసు. లేకపోతే ఏం లేదు.... వాటి వెనుక ఇంకోదొంగ అదే రాత్రి తనకోసం సిద్ధంగా తెరిచివున్న తలుపుల్లోంచి ప్రవే శించక పోవటం కొంత నయమని ఊరటచెందాను—”

“పోలీసులు ఇంత పనికిరాకుండా పొయ్యారేం?”

“మా ఇంట్లో జరిగిన నాలుగోనాడు సర్కిల్ ఇన స్పెక్టరు ఇంటికే కన్నం పడ్డది. ఎంత పోయిందో సరిగ్గా తెలియదు. అసలు కేసుకూడా రిపోర్టు కాలేదు. ఎలా

అవుతుందీ? వాళ్ళను వాళ్ళు కాపాడుకోలేరు—మననేం కాపాడుతారూ?"

"ఆ వారంలో ఎవరైనా నిమోనియాతో చచ్చాడేమో కనుక్కోక పోయ్యావూ?"

"అది మన కేవిధంగా వుపయోగిస్తుందీ?"

"దొంగ వానలో గంటల తరబడి వుండి వుంటాడనేదీ, వానలోనే తడుస్తూ వెళ్ళిపొయ్యాడనేదీ స్పష్టం. వాడికి నిమోనియా రాకుండా వుంటుందా?" తన తెలివి తేటల్ని చూడమన్నట్టు శేషు ఊపిరి గట్టిగా పీల్చి పొడుగు సాగేందుకు ప్రయత్నించాడు.

"అసలు ఆ దొంగది ఏవూరో ఏమో? వాడి పాత గుడ్డలు వొదిలివెళ్ళాడు, కాని యెడ్రసన్నా వొదిలి వెళ్లాడా? నిమోనియా తప్పనిసరిగా వొచ్చితీరాలని ఏమిటీ? వొచ్చినా చావాలని ఏముందీ? మంచి డాక్టరుకు ఫీజు ఇవ్వగలిగే పైకం చేతులో వుండగా వాడికేం భయం? అదంతా అలావుంచి నిమోనియా వొచ్చిన ప్రతీరోగి దగ్గరకూ వెళ్ళి యెక్కడ పరీక్షిస్తాం? అదంతా లేనిపోని శ్రమ!"

"ఒకవేళ మనకు మధ్యలో మెలకువ వస్తేమాత్రం ఏం చెయ్యగలం? వాళ్ళు ఏ ఇతర వృత్తికీ పనికిరాక యీ వృత్తికి దిగినవాళ్లు. మనకన్న బలవంతులు. జైలన్నా, పోలీసులన్నా, వాళ్ళు పెట్టే యమయాతనలూ బాధలూ లెక్క చెయ్యనివాళ్లు; చివరకు ప్రాణానిక్కూడా తెగించేవుంటారు. వెంట ఆయుధాలుకూడా వుంచుకుంటారు. వాళ్ళు పెద్ద

యుద్ధానిక్కూడా సిద్ధంగా వున్నవాళ్లాయె! మనం ఏమర పాటున వున్నవాళ్ళం. నిద్రమత్తులో తూలుతూ అప్పుడే లేచి విషయాన్ని అర్థం చేసుకొని మంచిదారి ఆలోచించు కొనే వ్యవధికూడా వుండదు. అసలు లేచేందుకే భయం! ఒకవిధంగా లేవకుండా నిద్రనటించడమే మంచిది. లేస్తే తనను పట్టుకుంటారనీ, తంతారనీ, జైలుకు పంపుతారనీ వీటన్నిటినుంచీ ఏదోవిధంగా దూసుకుపొయ్యేందుకు ప్రయ త్నిస్తూ ఆ తొందర్లో దగ్గరవున్న ఏ కత్తినో ఒక్కవిసురు విసిరికూడా పోతారు. పూర్వం ఒకసారి మా పొరుగింటా యన దొంగను పట్టుకోపోతే వాడు ఆయన చేతిమీద జన్మంతా గుర్తుండేట్టు బాకుపోటు పొడిచి మరీపొయ్యాడు. పోయిన విలువైన ఆభరణాలకల్లా ఆయన గాబడి ఆ మచ్చే! ఇంకా నయం.... ఆకత్తి ఏ గొంతులోనో పొట్టలోనో దిగబడ్డట్టయితే....?"

అప్పుడు ఏమయ్యేదో వూహించుకోమన్నట్లు ఆగాడు. మరతిప్పిన కుళ్లాయిలా రక్తం బొళబొళా కారేదని చెప్పక పోవటం, చెప్పేవిధానంలోని టెక్నిక్.

శేషు అంతా వూహించుకుంటున్నాడు. ఆ కనిపిం చని దొంగలమీద అతని కోపం మిన్నుముట్టింది. ఇప్పుడే వాళ్లు యెదురైతే ప్రాణానిక్కూడా తెగించి తలబడేందుకు తగినంత శక్తి తనలో సమకూరినట్టు తోచింది.... మధ్యలో మెలుకువ వచ్చికూడా చూసి సహిస్తూ వూరుకొని ఆ దొంగ తనాన్ని విజయవంతంగా సాగనివ్వటమే కాక అలాటివి

ఇంకా జరిగేందుకు ఒకవిధంగా ప్రోత్సాహాన్ని యివ్వటం— ఆ పిరికితనానికి తనలో తాను నవ్వుకున్నాడు. న్యాయాన్నీ చట్టాన్నీ కాపాడేందుకు—తన్నె తేనా—యెగిరి వాడిమీదికి దూకేవాడు జయాపజయాలు దైవాధీనాలు. ఈలోపల యిరుగుపొరుగు సహాయంకూడా వొస్తుంది. అప్పుడు ఆదొంగ వెధవను వేపచెట్టు మొదలుకు చేతులు వెనక్కు విరిచి చాంతాళ్ళతో కట్టి శరీరమంతా హూణం హూణంచేసి పోలీసు స్టేషన్‌కు లాక్కువెళ్లేవాడు... అప్పటికే పోట్లాటలో తను అలిసి పోయి వుంటే మిగతా జనమే ఆ పనిచేసేవాళ్లు. మరీ బడిపిల్ల కాయలువుంటే మళ్లీ యింకోసారి యింతమంచి ఛాన్సు దొరుకుతుందో దొరకదోనని వాడి ఎముకల్నికూడా విరగ్గొట్టే సన్నాహాలు చేసేవాళ్లు.... అప్పుడు తను తీరిగ్గా సిగరెట్టు ముట్టించి యీదృశ్యాన్ని కళ్లారాచూసి ఆనందిస్తూ, నాజూగ్గా పొగను గాలిలోకి వొదులుతూంటాడు. గుమిగూడిన జనంలో ఆడవాళ్లు (పిల్లలూ ముసలివాళ్లూ మినహాయించి) తన యీ అతిధైర్య సాహసకార్యానికి నోటితో పొగడక పోయినా కళ్ళతో మెచ్చుకుంటూంటే....! ఆ ఆనందమంతా నిజంగా అనుభవిస్తున్నట్టే తోచి, చెక్కటేబిలు విరిగేటంత బలంగా గుద్ది, యెగిరి గంతేసి....తనయెదుట దొంగకు బదులు ఇద్దరు స్నేహితులున్నట్టు ఇప్పుడే తెలుసుకొని నిరుత్సాహంతో కూలబడ్డాడు.

"ఏమిటీ—హిస్టీరియాం ఫిట్ కాదుకదూ !"

"శరీరం పైత్యించిందా?....డాక్టర్ని పిలవాలా?"

శేషు గట్టిగా నిట్టూర్చి "మీరందరూ పిరికిపందలు ! దొంగ యింట్లో ప్రవేశించి, హక్కున్న మీ ఆస్తిని దొంగి లించుకు పోతున్నా గుడ్లుమిటకరించి చూస్తూ వూరుకున్నా రంటే మీ శరీరంలో అసలు ధైర్యమనేది లేదు. పైగా నిద్ర నటించటమే ఒక విధంగా మంచిదని సలహా చెప్పొచ్చారు.... అసలు దొంగను చూస్తే మనకు కలిగే భయం కన్న, మనను చూస్తే దొంగకు కలిగే భయం యెక్కువై వుండాలి: ఎందు కంటే — వాడిది కల్మషాత్మ. మన ఒక్క కేకకు లోకమంతా (దొంగలు మినహాగా) మన పక్షం వహించి పోట్లాడు తుంది. న్యాయమూ, రక్షణ చట్టమూ, యెఱ్రబుట్టలూ మనకు యెప్పుడూ తోడునీడగా అందుబాటులో వుంటయ్. ఈ ఆయుధాలన్నీ వుంచుకొని భయపడితే-మన మొగతనం యెంతా?"

"అదంతా నిజమేకాని — వాళ్లు జీవితాలమీద నే ఆశలు వొదులుకున్న మొండి వెధవలు. డబ్బుపోతే మళ్లీ సంపాయించుకునే అవకాశం వుంది. కాని ప్రాణం పోతే....?"

"కబుర్లు చెప్పకు....అదేనేనైతేనా?–" అని తనైతే నిజంగా యేంచేసేవాడో ప్రత్యక్షంగా చూపేందుకు తగిన పరికరాలేమీ లేకపోవటమూ, పరిస్థితి ఊహాగానమేకనుక తగిన వుద్రేకం వెంటనే కలకగ పోవటమూ గమనించి, తన ప్రతాపాన్ని శబ్దమయేట్లు పళ్లు పటపటాకొరకడంతో సూచించాడు.

# 2

రాత్రి భోంచేసి నప్పట్నుంచీ ఆలోచిస్తున్నాడు. దొంగల గొడవ ఒక్కటే అతని బుర్రలో పనిచేస్తూవుంది కిటికీదగ్గర నిలబడి బైటికి చూస్తూవుంటే ఆ కటిక చీకట్లోంచి నిజంగా దొంగ వస్తూన్నట్టే తోచింది.... వెంటనే బ్యాటరీలైటువేసి చూశాడు.... ఒత్తుగా పెరిగిన మొక్కలు గాలికి తలలాడిస్తూం డడం తప్ప యింకేమీ కనిపించలేదు. ఆ మొక్కలచాటున దొంగదాక్కొనివుంటే - కనుక్కోవటం చాలాకష్టం. వెధవ మొక్కలు! వాసనలేని పూలనూ, పనికిరాని పళ్లనూ కాచేందుకూ, దొంగ వెధవల్ని ప్రమాదాల్నించి కాపాడేం దుకూ, గొంగళి పురుగులకు ఆహారాన్ని సరఫరా చేసేం దుకూ, భూసారాన్ని పీల్చేందుకూ తప్ప ఇంకెందుకూ పనికి రావు.... రేపే పీటన్నింటినీ పీకించి పెంట పోగులో వేయించా లని నిశ్చయించుకున్నాడు.

ఇంటిచుట్టూవున్న కాంపౌండ్ గోడను పరిశీలించి చూశాడు. ఏమంత యెత్తుగావుందీ? కుక్కల్ని, పందుల్ని, మేకల్ని — యింకా యిలాంటి జంతుజాలాన్నుంచి కాపాడేం దుకు తప్ప, దొంగలనుంచి కాపాడేందుకు మాత్రం యేవిధంగానూ పనికిరాదు తండ్రి పోతూపోతూ దొంగలకు అలివికాకుండా వుండేట్టు కోట గోడంత యెత్తున కట్టించి వున్నట్టయితే తనకీ మనోబాధ వుండకపోను.... ఐనా ఎంత యెత్తుంటే మాత్రం వాళ్లు రాలేకపోతారా? కొంతవరకూ కాపాడుతుంది కాని.... అసలు కాంపౌండ్ గోడలులేని ఇళ్ల

ల్లోనూ, పూరి పాకల్లోనూ, తలుపులూ, దర్వాజాలు కూడా లేని ఇళ్లజోలికీ దొంగలుపోరు. ఎందుకంటే లోపల యేం దొరకుతుందో వాళ్లు బైటనుంచే గ్రహించగలరు. తొందర పడి వెళ్తే-యింకో-చోట కష్టపడి మూటకట్టిన దొంగసొత్తును పొరపాటున కానీ, లేకఇంటివాళ్లు హఠాత్తుగా లేచి అరిచే అరుపులకుకానీ—ఆఇంట్లోనే మరిచిపోయో, వొదిలిపెట్టో రావొచ్చుకూడాను. అందుకనే పైన చెప్పినరకం ఇళ్లల్లో నివ సించే వ్యక్తులకు యీ దొంగలబాధ వుండదు; మనోచింత లేకుండా హాయిగా నిద్రపోతారు. ఏఇంట్లో ప్రవేశించినా రిస్కు ఒక్కటే! ఐశ్వర్యవంతుల ఇళ్లల్లో జొరబడ్డందుకు ఒకరకం శిక్షా, బీదవాళ్ల ఇళ్లల్లో జొరబడ్డందుకు ఒకరకం శిక్షా లేవుగా! అందుకని కాస్త గిట్టుబాటుకుకూడా కనిపెట్టి పోతూంటారు.

చెక్కుచెదిరేందుకు వీల్లేకుండా సిమెంటుతో పెద్ద భోషాణాలకుమల్లే కట్టిన డాబాలూ, మేడలజనం — వాళ్ళ కూడా యీభయం తక్కువే! నెలజీతాలమీద కాపలా వాళ్లనుకూడా పెట్టుకుంటారు. కనుక హాయిగానిద్రపోగలరు. పోతే తనలాంటి మధ్యతరగతి కుటుంబీకులు ఎటూకాకుండా వేళ్లాడాల్సిందే! తనయింటికి తనే వేరే జీతమేమీ లేని కాపలా వాడు.

భార్య భోజనం పూర్తి చేసివొచ్చి "గాలి లేదు. బైట పడుకుందాం" అంది.

బైట పడుకునేందుకు శేషుకు భయంగావుంది. మరీ ఆ దొంగల మొండిహృదయాల్నీ, తెగింపునూ అన్నిటికన్నా వాళ్లు చేబట్టే ప్రాణాపాయకరమైనఆయుధాల్నీ తలుచుకున్న కొద్దీ అతని మనస్సు ధైర్యపు శిఖరాలనుంచి బరబరా దిగ జార నారంభించింది. ఇదంతా బైటపెట్టకుండా (తన పురుషత్వానికి హాని కలిగేందుకు వీల్లేదుగా మరి.... అందులోనూ భార్య ముందు!) "ఇక్కడ కిటికీలోంచి గాలి బాగా వొస్తుంది. మళ్ళీవానవొస్తే ఇవన్నీ లోపలకి జేరెయ్యలేం.... ఆకాశం వైపుచూడు....మబ్బుయెలాపట్టిందో!" అన్నాడు.

"అమావాస్య నాడు చీకటిగా వుండదా యేం? మేఘాలు యెక్కడ వున్నయ్? నక్షత్రాలు బాగామెరుస్తూ వుంటే——?"

"దొడ్లోవొద్దులేవే!" అన్నాడు. కారణాలేమీ లేక పోవటంవల్లా, ఉన్నా బైటపెట్టేవి కాకపోవటంవల్లా—ఒకవిధంగా కంఠస్వరాన్ని బతిమాలుతూన్నట్టుగా తగ్గించి.

"ఇంట్లోమాత్రం నేను పడుకోలేను. నాఒళ్లంతా వేలింది."

"ఫరవాలేదు...."

"ఏమోబాబూ! మీకునచ్చచెప్పలేను. నేనుమాత్రం లోపల పడుకోలేను. కావాలంటేమీరుఇంట్లోనే పడుకోండి"

ఇది ఆమె నిశ్చితాభిప్రాయమని తేలిపోయింది. శేషుకు యెదిరించే శక్తి లేదు; అందులోనూ అకారణంగా! తను ఒక్కడూ యింట్లో పడుకోవడాన్నిగూర్చి యెక్కువగా

ఆలోచించాల్సిన పని లేదు. భార్యనుఒంటరిగా దొడ్లోపడుకో నిస్తే—నిజంగా ఆదొంగేవొస్తే అబలను కాపాడేందుకు, సబలుడైన తను—భర్తరూపంలోని సర్వరక్షకుడు యెందైనా అవసరం!....అందుకనే మరేమీ వాదప్రతివాదాలు జరక్కుండానే రెండు మంచాలూ దొడ్లోకి వెళ్లినయ్....

ఆమెకు వెంటనే నిద్రపట్టింది. శేషుకు నిద్ర రావటం లేదు, సరికదా దొంగల్నిగూర్చిన ఆలోచనలతో బుర్ర వేడెక్కుతూవుంది దాంతోపాటే కాస్తోకుస్తో మిగిలి వున్న అతని ధైర్యంకూడా ఒకపక్కనుంచి చల్లబడుతూవుంది. తప్పనిసరిగా పోట్లాడాల్సి వొస్తుందేమో — ఆ క్షణంలో కూడా తను యెందుకూ పనికిరాకుండా పిరికిపడి పోయ్యేట్టున్నాడు. తెగింపుతో కూడిన వాళ్లబలం ముందు తనెంతా?— అసలు ఒంటరిగా ఈవిషయాల్ని గూర్చి ఆలోచించేందుకే భయంగా వుంటే?

శేషు దృష్టి చప్పున పక్క మంచంమీద పడుకొన్న భార్యవైపూ—ఆమె మెడలోని బంగారు గొలుసు వైపూ మళ్లింది ఇంత విలువైన ఆభరణాల్నికూడా ధరించి ఆరుబైట పడుకుంటే—యెంత ప్రమాదం! లేని ఒక ప్రమాదాన్ని కొని తెచ్చుకోవటంలాంటిది....

భార్యను లేపుతూ "ఇదుగో! ఆ గొలుసు ఇంట్లో పెట్టిరా—" అన్నాడు.

"ఎందుకూ? అది మిమ్మేంచేసింది?" అందామె నిద్ర మత్తులో.

"రాత్రిళ్లు నీ అందం యెవరుచూస్తారేం? చెప్తా వుంటే?"

"నేను లేచి ఆ తాళాలన్నీ తియ్యలేను...." అని ఆమె ముడుచుకొని పడుకుంది.

శేషుకు బాగా కోపం వచ్చిందికాని — ఆ కోపాన్ని భరించాల్సిన వ్యక్తి నిద్రావస్థలో ఉండటంవల్ల, ఏ కారణాల మీద తనకీ కోపంవొచ్చిందో ఆ కారణాల్ని బైట పెట్ట లేని అశక్తతవల్లా మాట్లాడలేకపొయ్యాడు.

ఐనా యింట్లో యింకా విలువైన వస్తువులు కూడా ఉన్నయ్. వాటితోపాటు యీ గొలుసుకూడా ఇంట్లోనే వుంటే— తా మిల్లా యీ చల్లగాలికి మైమరచి నిద్రపోతే— అటువైపునుంచి దొంగ ఇంట్లో ప్రవేశించే అవకాశమూ వుంది. ఇతర వస్తువులతోపాటు యీ గొలుసుకూడా వాడికి అందివ్వటం అవుతుంది. ఈ గొలుసు యిక్కడే ఉండటం ఒకందుకు మంచిదే! కాని తను ఈరాత్రి ఇంటా బైటా కూడా కాపలా కాయాల్సివొచ్చింది.

తాలూకాలో ఒంటిగంట కొట్టారు. దొడ్లో చెట్ల చాటున చప్పుడైంది .... శేషు ఊపిరి బిగబట్టి ఒక్క క్షణం ఊరుకున్నాడు. ఒక్కడూ లేచి వెళ్ళి చూసేందుకు భయం. భార్యను లేపుతూ — నిజానికి అక్కడేమీ లేకపోతే తన తెలివితక్కువా, పిరికితనమూ బైట పడిపోతయ్.... ఎలాగో ధైర్యంచేసి బ్యాటరీలైటు వేసిచూశాడు. సజీవమానవ ప్రాణి యేదీ అక్కడ లేదని నిశ్చయంగా గ్రహించాక కాని,

అతనికాలు ముందుకుసాగలేదు. తను అనుమానించిన ప్రదేశాన్ని సమీపిస్తున్నకొద్దీ— తెలిసివుండీ అగ్ని గుండంలోకి పోతూన్నట్టనిపించింది.... పందికొక్కొకటి చరచరా దూసుకు పోవటాన్ని చూశాకకాని, అతని గుండె దడ తగ్గలేదు.... వెధవ దొడ్డి! ఒక ఫుట్ బాల్ గ్రౌండు, ఒక టెన్నిసుకోర్టూ పట్టేటంత ప్రదేశం! ఇంత విస్తీర్ణాన్ని ఒక్కడూ కాపలా కాయటం మాటలా ?

పడుకున్నాడన్నమాటే కాని మళ్ళీ అవే ఆలోచనలు! ప్రతిరాత్రీ యీ దొంగల ఆలోచనలు రాకపోవటంవల్ల భయంతో ఛస్తూ యిలా మేలుకుని కూర్చొని కాపలా కాయాల్సిన ఇబ్బంది వుండేదికాదు. సాయింత్రం ఆదొంగల ప్రస్తావన క్లబ్బులో రావటమూ, అది అదేపనిగా తన తలలో తందనాలాడటమూ మరీ ఘోరంగావుంది ఇంత ఆలోచించాక, దొంగ ఒకడు యీరాత్రి తప్పకుండా తన యింటికి పిలుపులేని అతిథల్లే వొచ్చి తీరుతాడనీ, వాడికి సరైన స్వాగతం యివ్వాల్సి వొస్తుందనీ, అందుకని రాత్రంతా మేలుకొని వుండక తప్పదనీ నిశ్చయించు కున్నాడు. ఐతే ఆవొచ్చే అతిథి యెవరో తనకు తెలియదు. వాడు బాగా కనిపించాలంటే యీ చీకటిరాత్రికి లైటు అవసరం. లాంతరు మరీ చిన్నదిచేస్తే ఆ కాస్తా గాలికి ఆరి పోతుందేమోనని, కాస్త పెద్దదిగానే వుంచి, యెత్తుగావున్న తులసికోటమీద పెట్టి ఆ పరిసరాలు బాగా కనిపిస్తున్నయ్యా లేదా అని చూసి తృప్తిపడ్డాక మళ్ళీమంచంమీద వాలాడు.

తనిలా నిద్రమేలుకోవటం నిజంగా బుద్ధిమంతుల లక్షణం. ఎందుకంటే అసలు ప్రమాదాన్ని ఎదుర్కోవటంకన్నా (ప్రమాదమని ధృడంగా తెలుసుకొని కూడా!) ప్రమాదమే రాకుండా దూసుకు పోవటం—కనీసం అందుకు ప్రయత్నించటం వెయ్యిరెట్లు మేలు.

కునుకు పడుతూవుంది పక్కసందులోని ఒక బజారు కుక్క ఊర్ధ్వస్థాయిలో అరిచింది..... వెంటనే దాని సైన్యమంతా అరవటం మొదలెట్టింది. ఆ సంగీతానికి శేషు త్రుళ్లిపడ్డాడు. యెవడో దొంగవెధవను పసికట్టి ఈ కుక్కలు మానవ సమాజానికి అలారం కొట్టి పుణ్యం కట్టుకుంటూన్నాయ్. ఆ దొంగ తన యింటివైపే వొస్తున్నాడేమో?.... ఆగి అన్నివైపులా బహు జాగర్తగా చూస్తున్నాడు. సరిగ్గా వలలోకి వచ్చాకనే కాని వాడి పనిపట్టకూడదు.....

పది నిముషాలకల్లా కుక్కలు తమ ఖోరస్‌ను ఆపి సన్నని రాగాలాపనతో క్రమంగా నిశ్శబ్దతలోకిజారినయ్.... అరగంట గడిచినా దొంగలజాడ లేదు. అనవసరంగా తన వలను మళ్ళీ ముడుచుకోవాల్సి వొచ్చింది. వెధవ కుక్కలు పోలీసులకన్నా అన్యాయం! రోడ్డున పొయ్యే ప్రతిమనిషినీ అనుమానించి అరుస్తయ్! వాటి సంగీతం వాటికే ఆనందం కాబోలు! ఒకనాటి రాత్రి మెయిల్ దిగొస్తుంటే తనంత పెద్ద మనిషినే అనుమానించి మొరుగుతూ వెంటబడ్డయ్! వాటికి యుక్తాయుక్త విచక్షణ శూన్యం—అందుకనే వాటిని కుక్కలు అన్నారు. రకరకాల ఎంగిలికూడా తినటం అలవా

టయ్యాక వాటికి ఏ ఒక్క బుద్ధీ జీర్ణం కాదు. రకరకాల బుద్ధులు.... పిచ్చివాడి తలలోని ఆలోచనలకు తోడ్పడేలాటివి వంటపడతయ్. అదేకాదు యింకో కుక్కను చూసికూడా అన్నీ మొరగటం ఆరంభిస్తయ్ చుట్టుపట్ల వాళ్ళకు నిద్రా భంగం అవుతుందనే జ్ఞానం కూడా లేకుండా తెల్లవార్లూ ఇలాగే గోలచేస్తుంటయ్.

కాని కుక్కల్ని ఒకందుకు మెచ్చుకోవాలి కూడాను. ఇలా గొంతుచించుకొని మొరగటం వల్ల దొంగలు భయ పడకపోయినా (వాళ్ళకిది అలవాటేకనక!) తనలాగు ధైర్యంగా కాపలా కాచేవాళ్ళకి ఉపయోగం; కునుకుపట్టే సమయాని కల్లా గోలచేసి పరాకు తెలుపుతూ వుంటయ్. ఇలాటి కుక్క లకు తోడుగా నల్లులూ, దోమలూ సమృద్ధిగావుంటే వేరే చెప్పాలా?—గస్తీవాడు అతినమ్మకంగా పనిచేసే అవకాశం యెంతైనా వుంది.

యెందుకైనా మంచిది — ఆ వొచ్చే దొంగకు ఆయుధం వుండితీరుతుంది; ప్రమాదం సంభవించే అవ కాశం వున్నదనే గట్టి నమ్మకం వాడికి వుంటుంది కనుక, తనకు సహాయంగా సిద్ధంగా ఆ ఆయుధాన్ని తెచ్చుకుంటాడు. అలాటి ఆయుధాలేమీ ప్రస్తుతం—యిప్పటికిప్పుడే తనకు దొరకవు కనుక —కనీసం లభ్యమయే వాటిల్లో మంచి ఆయుధాన్ని దగ్గర వుంచుకోవటం అవసరం. కట్టెపేళ్ళ గుట్ట లోంచి మరీలావు లేని ఒక సర్వీకర్రను ఏరి మంచం ప్రక్కనే పెట్టుకున్నాడు.

ఎలాగైనా ఇంకొక్క మూడుగంటలు మేలుకుంటే తెల్లారిపోతుంది ఇక్కణ్నుంచీ కాస్తకష్టం. కాని ఇప్పుడు పడుకుంటే మాత్రం ఇంతవరకూ కష్టపడ్డదంతా వృథా!

కాకపోతే యీనిద్ర తీరిగ్గా రేపటి ఆదివారం పగల్లో ఖర్చుపెట్టవొచ్చు. కూర్చొని మేలుకోవటం మంచిది. కాని కూర్చుంటే నడుం నొప్పి పడుతుంది. పడుకుంటే నిద్ర వొస్తుంది; యెలాగైనా మొండికేసి మేలుకోవాలి. ఎలాగూ నిద్రవుండదు కనుక, నడుం నొప్పి పట్టకుండానే నిద్ర దండగ పడటం మంచిది.... ఆలోచనలన్నీ ఇప్పటికి యింకి పోవటం వల్ల నిద్రాదేవి రెప్పలమీద నాట్యం చేయనారంభించింది. మధ్యమధ్య తనకు తాను పరాకు తెలుపుకుంటూ కళ్లు సగం మాత్రం మూసుకున్నాడు; మిగతాసగమూ అవసరమైన వెంటనే తెరిచేందుకు!

కాని నిద్ర అనేది చెప్పిరాదు. నిద్ర పోదల్చుకున్నప్పుడు అది రాక పోవటమూ, మేలుకోవా లనుకున్నపుడు అది రావటమూ, కొత్తవింతేమీకాదు. అందులోనూ ఆలోచనాభారంతో యెక్కువగా అలసిపోయిన శేషులాంటి వాణ్ని జయించటంలో నిద్రాదేవికి యెక్కువ శ్రమ కలగలేదు. ఆ చల్లగాలికి అతని కళ్లు క్రమంగా గట్టిగా మూతలు పడిపోయినయ్.

## 3

దగ్గర్లో, దగ్గర్లో ఏమిటీ—తన మంచంపక్కనే! యెవడో పెద్ద యెద్దంత వాడు నల్లగా తుమ్మమొద్దల్లే ఆ చీకట్లో

దాదాపు కలిసిపోతున్నాడు. లైటు ఆరిపోయి వుండటంవల్ల ముఖకళ అంత స్పష్టంగా కనిపించక పోయినా మిణుగురు పురుగులల్లే క్రూరత్వంతో మెరిసేవాడికళ్ళు భయంకరంగా వున్నయ్. వాడి శరీరం నిగనిగలాడుతోంది. బహుశా పట్టుకుంటే జారిపొయ్యేందుకు ఏలుగా ఆముదమో లేక అలాంటి జిగట పదార్థమో పట్టించి వుంటాడు. మోకాళ్ళపైకి పంచను ఎగకట్టాడు.... అవసరమైతే మైలు రేసుకు సిద్ధంగా వుండేందుకు.... ఒక్కమాటలో వాడు శేషు ఊహాచిత్రం లోని దొంగకు సరిపోలుతాడు.

వాడు ఆ నీచుడు, తన భార్యతో పోట్లాడుతున్నాడు. బలిష్ఠమైన వాడి చెయ్యి ఆమె మెడలోని గొలుసుమీద వుంది. ఆమె తన రెండుచేతులతోనూ పెనుగులాడుతూ వుంటే వాడు గొలుసును వొదలకుండానే ఒక్క చేతితోనే ఆచుకుంటున్నాడు .... ఆమె బాగా అలిసిపోయినట్టు గట్టిగా ఊపిరి వొదుల్తోంది. గాఢ నిద్రలో వుండగా అకాత్తుగా ఇలా వొచ్చి పడితే యెవరికైనా కష్టమే!

ఆమె "లేవండీ— దొంగండీ!" అంటూవుంది.

నిజంగా తను లేచి కలియబడాల్సిన సమయం. ఆమె దొంగను కొంతవరకూ అలిసేట్టుచేసి తనకు కొంత పనిని తగ్గించింది. వాడుమాత్రం నిర్భయంగా యెవరు వచ్చినా తననేమీ చెయ్యలేరన్న ధీమాతో పెనుగులాడుతూనే వున్నాడు.

తను లేచి వాడిమీదికి దూకాలనేమాట బుర్రలో మెరవగానే శేషు ధైర్యం నీళ్లు కారిపోయింది. ఆ భయంలో అతనికి ముచ్చెమటలు పోసినయ్.... బంగారు ఆభరణాలు పురుషులు ధరించే ఆచారం అంతగా లేకపోవటం ఒక విధంగా మంచిదే! లేకుంటే ఇప్పుడు తన భార్యస్థానంలో తను వుండేవాడు....ఛీ! యెంతో ధైర్య సాహసాల్ని ప్రదర్శించాలని నిశ్చయించుకున్న తనలాంటి నవయువకుడు ఇలా పిరికి పడిపోవటమేమిటీ?

లేద్దామని చూస్తూండగా, దొంగబొడ్డులో తళతళా మెరిసే బాకు కనిపించింది. వెంటనే యీ దుర్ఘటనను మరిచి పోదామని గట్టిగాకళ్లుమూసుకొన్నాడు....తనిప్పుడు లేవటం ఒకవిధంగా చెరుపుకూడాను. ఇక లాభం లేదని వాడు ఆ బాకుకుపనికలిగించవొచ్చు. ఆతొందర్లో అది తన ప్రాణానికే ఐతే—? తనవిలువైన ప్రాణాన్ని ఈ వెధవ గొలుసుకోసం బలిపెట్టాల్సివొస్తుంది. బతికిబాగుంటే మళ్ళీ సంపాయించు కోవచ్చు. బాకు ఏ పొట్టలోనో, ఏ కంఠంలోనో లోతుగా గుచ్చుకుంటే —పాతాళగంగ పైకిదూకుతూన్నట్టుగా బొళ బొళా కారే రక్తానికే తనకళ్లు గిర్రునతిరుగుతయ్. ఏ గొలుసు కోసం ఆదొంగ ఎంతఘోరాన్నయినా చేసేందుకు సిద్ధంగా వున్నాడో ఆ గొలుసు వాడిమొహాన విసిరిపారేస్తే (అప్పుడు వాడికి పెద్దదెబ్బ తగలకూడదు; తాము ఆగొలుసును యెంత చిన్నచూపుగా చూస్తున్నారో వాడికి అర్థమయ్యేట్టు చేస్తే చాలు) యీపీడ వొదుల్తుంది. అలాగు కళ్లుమూసుకొని

"వెధవగోలుసు — యిచ్చెయ్!" అని భార్యను పురమాయిద్దామనుకున్నాడు, కాని తను మాట్లాడటం మొదలు పెడితే—నిద్రపోతూన్నవాళ్లు మాట్లాడరని దృఢంగా తెలిసిన దొంగ—యువకుడైన తనవల్ల హానికలగకుండా వుండేందుకు ఏదో వొక అఘాయిత్యం చెయ్యవచ్చు. లేక, ఇంత పిరికి పడిపోవటం వాడికి కొత్త ధైర్యాన్ని ఇస్తుంది. అప్పుడు వాడు మిగిలిన వస్తువులకోసం చీకటి రాత్రుల్లో అప్పుడప్పుడు తిథిగా దర్శిస్తూఉండటం తనకు అంత క్షేమకరంకూడా కాదు; లేక మళ్ళీమళ్ళీ వొచ్చేశ్రమను తగ్గించుకునేందుకు, మిగిలిన వాటిని కూడా వెంటనేమూటకట్టి ఇప్పుడే తనకు ఇమ్మని బాకు చూపుతూ భయపెట్టి—ఇకముందు రాత్రుల్లో వాడి భయం తమకు మరిలేకుండా చేసినా చెయ్యవొచ్చు... ఏమైతేనేం ఈ రాత్రి తననిండు ప్రాణాన్ని (తనకు ఇంత వరకూ అర్ధప్రాణాలూ పావుప్రాణాలూ, తోడుగా లేక పోవటం ఒక అదృష్టం! వాటికోసం తనభార్య బాధపడుతూండటంలోని మాహాత్మ్యాన్ని రేపు యీాదృశ్యాన్ని ఆధారం చేసుకుని బాగాఅర్థమయేట్టు చెప్పవొచ్చు!) లేక తననిండు ప్రాణంలోని ఏ కొద్దిభాగాన్నీ ఇప్పుడు రిస్కు చేయదలచ లేదు... కాకపోతే ఆ ప్రాణాన్ని — వీడు కాకపోతే వీడి తరువాతవొచ్చే వాడికోసం భద్రంగాదాచి, అప్పుడు వాడిపని పట్టి, వీడినేరాన్ని కూడావాడిమీాద రుద్ది—మొత్తం శిక్షనంతా వాడికేవేస్తే సరిపోతుంది. ఒకపార్టీలోవాడుతినే దెబ్బ—పార్టీ కంతకూ తగుల్తుందనే సిద్ధాంతంలోని సత్యాన్ని యీా విధంగా రుజువుచవొచ్చు.

భార్య ఇంకా పెనుగు లాడుతూనే వుంది. తను లేచి "దొంగలు! దొంగలు!" అని కేక లేస్తే ? ఇది బాగా నేవుంది. కాని అతనికి నోరాడ లేదు. గొంతంతా యెండిపోతున్నట్టని పించింది. తనునిజంగానే మృత్యుకుహరంలోకి జారబడు తూన్నట్లుతోచింది.

ఒక దొంగతో పోట్లాడాల్సి వొస్తుందేమోనని ఏరి తెచ్చుకున్న సర్వీకర్ర జ్ఞాపకం వచ్చింది. అది యీ సమ యంలో తనకు సహాయపడగలదు. కాని ఇలాంటి పోట్లాటలు తనకు మరీ కొత్తమేళం. కర్రపట్టు నెందుకు చేతులు ఒణుకు తున్నయ్. తన కర్రను చూసి దొంగ కత్తిని బైటికి తీస్తు వొచ్చు. కర్రకన్న కత్తిపదునైందని తనకు తెలుసు యీ సందర్భములో ప్రవేశం ఏమీలేని వ్యవహారంలో జోక్యం కలిగించుకోవటం కన్నా — బుద్ధిశాలి లక్షణం ఏమిటంటే, కిమ్మనకుండా ఊరుకోవటం !

ఆమె ఇలా ఇంకెంత సేపు పెనుగులాడుతుందీ ? తనను నిద్ర లేపేందుకు ఇంకా ప్రయత్నిస్తూనేవుంది. తనకు మెళుకువ వచ్చింది కాని మేలుకొనే వున్నట్టు సూచించేం దుకు వీల్లేని సంఘటనాయె ! మేలుకున్న వాణ్ని నిద్రలేపేం దుకు చేసే ప్రయత్నం వ్యర్థం ! అసలు తను మేలుకొనే వున్నట్టు దొంగకు కాకుండా ఆమె ఒక్కతెకే తెలిసే సూక్ష్మ మార్గం ఏదైనావుంటే యెంత బాగుండేదీ !

ఇలాగే తెల్లవారేదాకా పెనుగులాడి దొంగను పట్టించేందుకు ఆమె తెలివిగా ఆలోచించి వుంటుందా? ఇది

మంచిపద్ధతేకాని, తెల్లవాళ్లూ పోట్లాడటం కష్టం. అదీకాక తనుకన్న తొందరగానే యీ వ్యవహారాన్ని పైసలు చేసుకొని కాళ్ళకు బుద్ధిచెప్పి తీరాల్సిన తన బాధ్యతను దొంగ యేవిధంగానూ మరిచిపోలేదు.

తనకు యింకేదారీ కనిపించటంలేదు.... ఒక ప్రేక్షకుడిగా మాత్రమే ఉండిపొయ్యాడు....

ఉన్నట్టుగా దొంగ పెద్దకేక పెట్టాడు. విషయాన్ని తెలుసుకునేందుకు శేషుకు యెక్కువసేపు పట్టలేదు. ఆమె వాడి చేతిమీద గట్టిగా కొరికింది....గట్టిగా....అంటే, కండ కండా వూడివొచ్చింది. అంత బలిష్ఠకాయుడూ ఎగిరి గంతేసి బాధతో కేకవేశాడు.... కేక పెద్దదవటంవల్ల, ఇరుగుపొరుగుల్ని అనవసరంగా ఆహ్వానించటానికి ఎంతైనా వుపయోగపడుతుందని వెంటనే గ్రహించి, తెలివిగా బాధతో మూలుగుతూ పరుగెత్తసాగాడు... శేషుహృదయం ఆనందంతో పొంగిపోయింది....నిజంగా తన భార్యకు సన్మానసభ నొకదాన్ని ఏర్పాటుచేసి, వీరనారీమణుల లిస్టులో ఆమె పేరు కూడా జేర్పించి తీరాలనే తీర్మానాన్ని ప్రవేశపెట్టాలి.

....యీ వెధవ పీడకలనుంచి ఇప్పుడే మెళుకువొచ్చి "వెధవ దొంగలు!....బోడిదొంగలు!" అంటూ తృళ్లిపడి లేచాడు. అందులోనూ మలయమారుతంవీచే యీ తెల్లవారు జామున యీ పీడ కలేమిటీ? భార్యను లేపి అదంతా చెప్పెయ్యాలనుకున్నాడు. ఇప్పటికి కాని అతని గుండె దడ బాగా తగ్గలేదు.

ఆమె మేలుకునేవుంది.... తన కలను వినేందుకు సిద్ధంగా ఉన్నట్లు!

"వెధవకల!....బోడికల!" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు. శేషు చెప్పుకు పోవటం మొదలుపెట్టాడు. ఆమె అంతావిని హేళనగా నవ్వుతూ "దొంగలు పడ్డ ఆరునెల్లకు కుక్కలు మొరిగినయ్యట! దొంగ నిజంగానే రావటమూ, మీరు చెప్పిన సంఘటన అంతా మీకళ్లముందు జరుగుతే—అదంతా కలఅనటం — ఏం తెలివితేటలండీ!" అంది.

"నిజంగానే వొచ్చాడా?"

"కాక ? నేను వాడితో అరగంటసేపు పెనుగులాడాను. మెడంతా ఒరుసుకుపోయింది. మిమ్మల్ని లేపుతే ఎంతకూ లేవరాయె! చివరకు నాకేమీ తోచక కండ కూడా ఊడివచ్చేటంత బలంగా వాడి చెయ్యి కొరికాను-"

శేషు అనుమానం తీరక లైటు వేసి చూశాడు. పక్కంతా తడిఆరని రక్తంతో తడిసివుంది

"కండ ఏదీ?" అన్నాడు.

"అదివాడిచేతినే వుండిపోయింది. వాడిజన్మంతా గుర్తు వుంటుంది!"

"పోట్లాటలో అలసిపోయిన ఆమె మూర్తి, ఫాల భాగంమీది స్వేత బిందువులూ, మెడమీదపడ్డ గాట్లూ— ఇదంతా కల ఎలాగవుతుందీ?"

"వాడితో—అంత బలమైన వాడితో పెనుగులాడావు టే? భయం వెయ్యలా?"

"భయమేముందీ? మీరు పక్కనే ఉన్నారని ధైర్యంగానే వుంది. మేలుకునే ఇదంతా చూస్తూ ఊరుకున్నారేం?"

"వాడిబొడ్డులో కత్తివుంది.... అది చూశాక కూడా భయం వెయ్యలా?"

"భయం! దూరంగావున్న మీకుభయం! నిజంగా సంఘటనలో పాత్ర తీసుకున్నాక—భయంలోకే పూకాక ఇంకా భయింవేరే ఎక్కణ్ణుంచి వొస్తుందీ? మొదట్నే వాడి బొడ్డులోని కత్తిని చూసినట్టయితే అదిలాగి వాణ్ణే పొడిచి పారేసేదాన్ని!"

"ఎంత గుండె నిబ్బరమే!"

"అందరి ధైర్యాలూ మీలాగే వుంటయ్యనుకోకండి. వాణ్ని మంచి ఆయుధంతోనే ఎదుర్కొన్నాను!"

"వెధవను యీసారి రానీ!"

"ఈసారికూడా హాయిగా కలగంటూ పడుకుందురు గాని. ఐనా ఆరునెల్లలోపలమాత్రం వాడిటురాడు. అంతకు తక్కువకాలంలో వాడిచెయ్యి బాగుపడదు. యీ సంగతి మిగతా సజ్జుకుకూడా చెప్తాడు. వాళ్లకన్నాడా చేతులంటూ ఉంటాయ్ కనుక వాళ్లుకూడా యిటు వైపురారు."

"నాకొక ఆలోచన తట్టింది. రేపే వాణ్ని పట్టుకుందాం!"

"ఎట్లా ?"

"వాడు కట్టుకట్టించుకునేందుకు రేపు ఏ ఆసుపత్రి కన్నా రాకమానడు. వెంటనే వాణ్ని పట్టేసి నీపళ్లగాట్లను సరిపోల్చి, జైలుకు పంపిస్తాను"

"గొప్ప పనిచేస్తారు! ఇక్కడికి వచ్చినప్పుడు నేను ఒక్కతెనూ చస్తూంటేమాట్లాడకుండాఊరుకున్నారు కాని రేపు యెప్పుడో ప్రతిఆసుపత్రి దగ్గరా, ప్రతి డాక్టరు దగ్గరా కాపలా వేసి పట్టుకొందురు కాని! భలే" అని నవ్వసాగింది.

శేషు నిరుత్సాహపడి, తన ఓటమికి బాధపడతూ, వెంటనే ఆలోచనరాగా అన్నాడు: "అసలు నేను మొదటనే చెప్పాను. యీశ్రమా, యీ ప్రాణాపాయాలూ యివేమీ లేకుండా ఇంట్లోనే పడుకుందామన్నాను. నువ్వు వినలేదు: కనీసం ఆ గొలుసు తీసెయ్యమన్నా మాట పెడ చెవిని పెట్టావ్, మాట విననందుకు అనుభవించావు.... నేను కల అనుకున్నాను కాని లేకపోతే—ఇక్కడ సర్వీకర్ర కూడా సిద్ధంగావుంచాను. దీనితో వాడికి కపాల మోక్షాన్ని ప్రసాదించేవాణ్ణి—"

"ఈ సారి వచ్చినప్పుడా?" అని నవ్విందామె.

"పోనీ.... నాకు ధైర్యంలేదనే అనుకో. ఐతే మాత్ర మేం? నాకు తెలివితేటలూ, విజ్ఞానమూ సకారణ వాదనా వుంది. అందుకనే అసలు ప్రమాదాల్లోకి పోకుండానే కాపాడుకోగలను. ధైర్యం అంటూ ఉండగానే సరా?

ఆ నమ్మకంతో ఇలాటి అనవసరమైన ప్రాణాపాయాల్ని యెదుర్కోవాల్సి వొస్తుంది. అందుకనే—"

"పోనీండి.... మీరు మహాబుద్ధిశాలురు! కాస్సేపు పడుకొని అలసట తీర్చుకోండి" అందామె.

శేషుకు జవాబేమీ దొరక్కపోగా తన బుద్ధి విశేషాన్ని భార్య యెందుకు గ్రహించలేదో అర్థమవలేదు.

జూన్ 1947



# పొద్దు తిరుగుడు పువ్వు

ఆమె పదిహేనవ ఏట —

దగ్గరి బంధువుల ఇంట్లో పెళ్ళికి వెళ్ళింది. పెళ్ళికి వచ్చిన వారి మాటల్నిపట్టి వరుడు ధనవంతుడనీ, రూపవంతుడనీ, విద్యాధికుడనీ, ఇంతమంచి వరుడు దొరకటం చాలా అదృష్ట మనీ గ్రహించింది. వధూవరులు పీటలమీద కూర్చున్నప్పుడూ, మంగళహారతి పాటల్లో తను పాల్గొన్నప్పుడూ వరుణ్ని చాలా దగ్గర్నుంచి చూసింది.... తను విన్నమాటల్లో అతిశయోక్తి ఏమీ లేదని తెలుసుకుంది. నిజానికి చాలా అందగాడు; అతని కళ్ళల్లో విజ్ఞానకాంతీ, చురుకుదనమూ స్పష్టంగా కని పిస్తున్నాయ్.... తనక్కూడా ఇలాంటి భర్తే దొరుకుతే.... ఎంత అదృష్టం!

ఆక్షణంనుంచే ఆమె ఆలోచనలు వివాహ సమస్యమీద లగ్నమవ సాగినయ్. వరుణ్ని ఎన్నుకునే విషయంలో తల్లి దండ్రులు తనకు స్వాతంత్ర్యాన్ని ఇస్తారనీ, తనుమాత్రం మహా మెలకువతో ఉండి జీవితసమస్యను ఎదుర్కోవాలనీ, ఏమాత్రం పొరపడ్డా కాలుజారి సుడిగుండంలో పడటంతప్ప దనీ తెలుసుకుంది; అందులోనూ యీ సుడిగుండంలో పడితే చావటమూ కష్టమే—బతకటం అంతకన్నా కష్టం!

ఆ రాత్రి అకాత్తుగా ఆమెకు రాజారావు జ్ఞాపకానికి వొచ్చాడు. అతను క్లాసులోకల్లా తెలివైన కుర్రవాడు. మాష్టర్లందరూ అతన్ని మెచ్చుకుంటారు. తనుకూడా తనకు

తెలియకుండానే కొద్దిరోజుల్నుంచీ అతన్ని మెచ్చుకుంటున్నట్టు ఇప్పుడే తోచింది. అతనిమీద ఎంతో ఇష్టంకూడా ఉన్నట్టు తెలుసుకునేందుకు ఆమెకు ఎక్కువసేపు పట్టలేదు. అదివరకు అతని నోట్సు నాలుగైదుసార్లు అడిగితీసుకుంది. అంతకు మించిన పరిచయం యేమీలేదు

మరికొంత సేపు ఆలోచించగా—రాజారావు తనకు తగిన భర్తగాకూడా తోచింది.... కాని అతని చదువూ తనచదువూ ఒక్కటేఐతే? తను పెళ్ళయాక తను ఇంట్లోకూర్చోవొచ్చు. అతనింకా పెద్దచదువులకు వెళ్తాడు ఈవిధంగా సరిపెట్టుకోవొచ్చు.... కాని తన వివాహ సమస్యను ఇంతత్వరగా తేల్చుకోవటంలో తొందరపడుతూన్నట్టు తోచింది. ఆలోచనలుకూడా పరిపక్వం కాకముందే, మనిషి నిజస్వరూపమన్నా తెలుసుకోకుండానే తన హృదయంలో శాశ్వత స్థానానికి అవకాశాన్ని కల్పించటం కేవలం మూర్ఖ్యమే నని పించింది.

ఏమైనా రాజారావు విషయం తరచాల్సిందే .... మర్నాడే అతన్ని ఇంటికి 'టీ' కి పిలిచింది. అతను వొచ్చాడు. కులాసా ధోరణిలోనే సంభాషణ సాగిపోయింది. రోజూ తనతో చదువుకునేందుకు రమ్మని ఆహ్వానించింది. మొదట్లో అతను ఇష్టపడలేదు. కాని కొంత సేపు బలవంతంచేశాక ఇష్టపడక తప్పలేదు.

అతను దగ్గరవుతున్నకొద్దీ అతని లోపాలు తనకు అర్థమవ సాగినయ్, అందులోనూ మొదటినుంచీ విమర్శనా

దృష్టితో బయలుదేరాక అతి త్వరలో ఆ లోపాలనేవి బైట పడక తప్పదు.... అతనంత చురుకుగా త్వరగా, తను ఏ విష యాన్నీ గ్రహించలేదు. అతను త్వరత్వరగా పాఠాలు చదువుకు పోతాడు. తనకు అంత త్వరగా అర్థమయ్యేవి కావు. తన కోసం అతను ఆ గేస్థితిలో ఉండడు. లెక్కల్లోకూడా అంతే. అసలు లెక్కలే అతనిదగ్గర నేర్చుకోవాలని ఆమె ఆలోచన. తనకు అర్థంకానిచోట చెప్తాడు. కాని తను వెంటనే గ్రహించ లేక, ఒకటికి నాలుగుసార్లు అనుమానాల్ని బైటపెట్టాల్సి వొచ్చేది: అప్పుడు విసుగుదల అతని ముఖంలో స్పష్టంగా తను చూడగలిగేది; వెంటనే తనకు కోపంకూడా వొచ్చేది. ఇలా తనమీద విసుక్కునేవాడిమీద తనకెలా ఇష్టం కలుగుతుందీ ?

ఇంకోరకంగా రాజారావును పరీక్షించాలనుకుంది రిబ్బన్లూ, సోపులూ, స్నోలూ, పౌడర్లూ తెచ్చిపెట్టమని అడిగింది. అతను జవాబుచెప్పకుండా ఒక్కక్షణం జాలిగా తన ముఖంలోకిచూసి వెళ్ళిపోయ్యాడు. అంతే మళ్ళీ తన ఇంటి చాయలక్కూడా అతను రాలేదు. స్కూల్లోకూడా మొహం తప్పించుకొని తిరిగేవాడు. సంగతేమిటో తెలుసుకొనేందుకు ఆమె సుందరరావు సహాయాన్ని కోరవలసి వచ్చింది.

రాజారావు ఏమీ లేనివాడనీ, వారాలమీద చదువు కుంటున్న దిక్కులేనిపక్షినీ విన్నక్షణాన—కొన్నిక్షణాల వరకూ ఆమె మొద్దు బారిపోయింది. ఇంటికివొచ్చి ఆమె ఆలోచనలో పడ్డది. ఇంకానయం; ఈ స్నేహంఅనే వంకతో తనింకా

ముందుకు సాగినట్టయితే తను ఆ సుడిగుండంలో పడితీరేది. ఆ రాజారావుకే తను భార్య అయినట్టయితే — రిబ్బన్లూ, సోపులూ, పౌడర్లూ లేకపోతేపోయె — మాధాకవళంకూడు తనకు తప్పేదికాదు. పైన ఆకాశంలో పసిడి సింహాసనం మీద దిటాయించి కూర్చున్న సర్వేశ్వరుడే తనను యీ ప్రమాదంనుంచి తప్పించినందుకు, వాడికి హృదయపూర్వకంగా కృతజ్ఞతాభి వందనాల్ని అర్పించింది.

ఈ దుర్దశలో సుందర్రావు తనకోసం రాకపోకలు సాగించాడు. పేరుకుతగినంత సుందరరూపుడు కాకపోయినా, స్వరూపం ఏవగింపుమాత్రం కలిగించదు. కనుకనే ఆమె దృష్టి వెంటనే సుందర్రావుమీద లగ్నమైంది. సుందర్రావు సందుచివర ఉండగానే, అతనికారు హారన్ తనకు పరాకు చెప్తుంది. మరీ అతనికారులో బీచిమీదికి షికారువెళ్తేఎంత ఆనందం! తను సుందర్రావును ఎందుకు పెళ్ళిచేసుకోకూడదూ?.... ఐనా మరికొంత ఆలోచించాలి.

అడక్కముందే రిబ్బన్లూ, ఊలూ, సబ్బులూ, పౌడర్లూ, స్నోలూ- ఇంకఎన్నో తనకు తెలియనివీ, సమయానికి జ్ఞాపకంరానివీ, సుందర్రావు దిగుమతి చేస్తూనే ఉన్నాడు. కాని సుందర్రావు బుర్ర మహాగట్టిది. అది ఏరకం కొబ్బరి పెంకోకాని, చదువుమాత్రంలోనికి జొరబడటం చాలాకష్టం. కలిసి చదువుకునేప్పుడు తననుచూస్తూ లొట్టవేస్తూ కూర్చునేవాడు. ఆ చూపు తనను గాయపరుస్తూన్నట్టు ఉండేది. మెరుగు కాగితంతో శరీరమంతా పాలిష్ చేస్తూన్నంతబాధ

కలిగేది. ఎలాగైనా అతనిచేత చదివించాలని తేలికభాషలో చెప్పేది. కాని అతనికి అర్థమయ్యేదికాదో, లేక తనచేత మళ్ళీ మళ్ళీ చెప్పించుకోవాలనో తిరిగి తిరిగి అడిగేవాడు. తను విసుక్కునేది; దాంతో అతను దిమ్మరడీ-అంత ముఖం చేసుకుని కూర్చునేవాడు. తను ఓదార్చుదా మనుకొనేది కాని ఈ రకమైన అలుసివ్వటం తనకు ఇష్టముండేదికాదు. ఫ్లాస్కులో వున్న టీ అంతా తాగకూడా ఎనిమిది కాక ముందే పుస్తకాలమాటా, పరీక్షాపత్రాలమాటా, మార్కులు పంచటంలో ఎగ్జామినర్ల పిసినిగొట్టు తనంమాటా, అంతా మరిచిపోయి గురక పెడుతూ కుంభకర్ణ పర్వంలో నిమగ్న మయ్యేవాడు. అతని సోమరితనమూ నిద్రా, మరీ రాత్రిపూట పసిపిల్లలు భయపడేట్టు శబ్దంచేసే ఆ పాడు గురకా చూస్తే ఆమెకు వెర్రికోపం వొచ్చేది. ఆ ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు లాంతరు దగ్గరజేరిన పురుగులు అతని నాశికారంధ్రాల గుండా ముందుకూ వెనక్కూ సీజన్ టికెట్ వ్యవహారంగా తిరగటంచూస్తే నవ్వుకూడా వొచ్చేది. ఆ క్షణంలోనే అతని కారూ, అతను తనకోసం అయాచితంగా తెచ్చే బహు మానాలూ, దయకోసం ప్రదర్శించే వినయమూ-ఇవేమీ అతని నేరాల్ని కప్పిపుచ్చేవిగా తోచేవికావు. అతని మట్టి బుర్ర-సిమెంటు కట్టడం అనటం సమంజసం - అతని యీ ప్రవర్తన అతన్నొక పశువురూపంలో చూసేందుకు మాత్రమే సహాయపడేవి.

ఎలాగైనా యీసుందరరావును వొదిలించుకోవాలనే ప్రయత్నంలో ఉండగానే-తను ప్యాసవటమూ, అతను తప్పటమూ-కొంతదూరాన్ని ఇద్దరిమధ్యా ఏర్పరిచి అతని పీడను వొదిలించినవి.

ఈ సంవత్సరం ఆమె సమస్య మరీ తీవ్రరూపం దాల్చింది. తన వయస్సంతా గడిచిపోతూన్నట్టూ, విలువైన కాలమంతా త్వరత్వరగా తనకు కొరగాకుండానే సాగిపోతూ న్నట్టూ ఆమెకు తోచింది. ఇంట్లో తల్లిదండ్రులుకూడా తన వివాహ సమస్యమీద తీవ్రంగా చర్చిస్తూ తొందరపడు తూన్నట్టు కూడా గ్రహించింది. ఇలా తను ఆలస్యం చేస్తూ కాలయాపనచేస్తే మాత్రం తల్లిదండ్రులు తమకు నచ్చిన వాడికి తనను అంటగట్టక మానరు కనుక — త్వరగా మేలు కోవాలని, తరువాత పాశ్చాత్తాపపడి లాభంలేదనీ తెలుసు కుంది.

ఈ కొత్త సంవత్సరంలో ప్రసాదరావు ఆమె హృద యాన్ని వెంటనే ఆకర్షించగలిగాడు. అతను తనలాంటి కన్యల్ని ఇట్టే ఆకర్షించగల సమర్థుడనేందుకు సందేహం లేదు. తను ఇతన్ని పెళ్ళాడితే....?

మామూలు తోవనే ప్రసాదరావుకూడా స్నేహ ప్రాంగణంలోకి ప్రవేశార్హత లభ్యమైంది. అతను ముక్కోపి. హాస్యానికి అన్నా చిర్రు బుర్రుమంటాడు. కాని ఎదుటివ్యక్తిని మాత్రం ముందు వెనుకలు ఆలోచించకుండా ఎంతఎగతాళైనా చేస్తాడు; మరీ అతని వ్యవహారం ఇతర్లను

గాయపరచటమూ, కాని ఇతర్లచేత గాయిపడకుండా ఉండటమూ యీ రెంటికీ ఎక్కువ పెట్టినట్టు ఉండేది. చదువుసంధ్యల మాట అటుంచి-తనను ఒంటరిగా దగ్గరకు లాక్కునేందుకు ప్రయత్నించాడు. ఆమెకు కోపంవొచ్చింది. కాని కోపాన్ని ప్రదర్శించి ఆమూఘుడిని పీటముడిగా చేయకుండా జాగర్తగా, తెలివిగా ఏవో సాకులు కల్పించి తప్పించుకుంది. అతనిలా తొందరపడుతూ, తనవెంటపడి తననుంచి ఏం ఆశిస్తున్నాడో గ్రహించేందుకు ఆమెకు ఎక్కువసేపు పట్టలేదు. తీగెకదిలిస్తే కంపంతా లేచినట్టు స్కూల్లోకూడా గోడలూ, బ్లాక్ బోర్డులూ చెడటం మొదలుపెట్టినయ్. దాంతో జ్ఞానోదయమైంది. చాలా శ్రమపడి, బెదిరింపులతో తిట్లతో అతన్ని వొదిలించుకునేప్పటికి తాతలు దిగివొచ్చారు.

అలసటను తీర్చుకోవటంలో మరికొంతకాలం వొళ్ళిపోయింది. ఇప్పటికి ఆమె ఒక నిగూఢసత్యాన్ని గ్రహించింది: అనుభవశూన్యులైన యీ స్కూలు కుర్రాళ్ళను జేరనివ్వటమంత బుద్ధితక్కువ లేదు!

క్రమంగా ఆమెదృష్టి ఇరుగు పొరుగు యువకులమీదికి ప్రసరించింది. ఎదురింటి ప్లీడరుగారి తమ్ముడైతే...? ఆ కిటికిలోంచి ఎప్పుడూ గుడ్లగూబలాగు చూస్తూ కూర్చుంటాడు. తనను పెళ్ళాడినా తనకన్న అందగత్తెకోసం మిగతా కిటికీల్నికూడా తెరిచి ఇండియా మ్యాపులాటి తన ముఖాన్ని ఆ చువ్వలదగ్గర జేర్చక మానడు. అదీకాక ప్లీడరుగారికి ఏముంది కనుకా? నెలకు నాలుగైదుసార్లన్నా తన యింటికి

దేనికో వొకదానికి అప్పుకోసం రావల్సిందే! పొరపాటున యీ పెళ్ళికనుక అయితే- వాళ్ళమొత్తం కుటుంబం ఆఇల్లు ఖాళీచేసి-తన ఇంట్లో శాశ్వత నివాసాన్ని ఏర్పరుచుకోక మానరు.

పోనీ డాక్టరుగారి బావమరిది అయితే-? చదువూ సంధ్యా శూన్యమైనా మంచి మంచి సూట్లు వేస్తాడు. ఎదో మంచి ఆస్థి వుందికాని—దుర్వ్యసనాలతో అదంతా తరగటం ప్రారంభమైంది. త్రాగి తందనాలాడేవాడు తనకు భర్తకావటంకన్నా దురదృష్టం ఇంకేం వుంటుందీ?

ఆలోచనలతో ఆమెబుర్ర బాగా వేడెక్కి- పోయింది. ఏ ఆలోచనా లేకుండా ఉంటే ఎంతైనా బాగుండిపొయ్యేది. బుర్రలో కలిసి పోయిన ఆలోచనలన్నీ– పొయ్యిమీది పాల లాగు పొంగి తెకతెక లాడసాగినయ్.... అసలు తను యీ విధంగా ఒక్కొక్కర్నే పరిశారెయ్యటం మొదలు పెడితే— ఇక మిగిలే దెవరో ఆమెకు తోచలేదు—

మర్నాడే పెళ్ళిచూపులకు ఎవరో వొస్తున్నారని విన్నది. ఆమాట చెప్పకుండా, కనీసం తనకు తెలియకుండానే ఏరోజ్జు మీదనో తనను చూసిపోయినట్టయితే ఎంత బాగుండేది! ఈ కొత్త సమస్యతో ఆమె ఆలోచనలు మళ్ళీ రేగినయ్. ఆ ఆలోచనలు ఎంత భయంకరమైనవో ఆమెకు బాగా అనుభవం వుంది. ఆ వొచ్చేఅతనికీ తనకూ ఒకవేళ వివాహం స్థిరమైతే? ఆ కొత్త వ్యక్తితో తనెలా సరిపెట్టుకో గలదు? పాతవాళ్ళలో కనిపించే లోపాలు ప్రస్తుతం కనిపిం

చవు.... కాని మొదటిరాత్రినుంచే సుందర్రావులాటి గురక ప్రారంభమైతే....? అందులోనూ యీ వొచ్చే అతను రెండో పెళ్ళివాడట.... ముసలాడేమో ఖర్మం! ఇక యీ సమస్య తన జీవితాంతంవరకూ తేలదా యేం?

ఏమైనా యీ విషయమై ఆలోచించటం మరీ అగాధాల్లోకి పోవటం. అది బాధో, ఆనందమో ఇంకేమైనాసరే మాట్లాడకుండా ఊరుకోవటమే ఉత్తమంగా తోచింది. మలేరియారోగి బలవంతాన క్వైనైన్ మిక్శ్చర్ తాగినట్టు, చిన్న పిల్లవాడు ఎంత ఆగంచేసినా ఆముదాన్ని మింగి తీరవలసినట్టు- తనకూడా ఇది గురితప్పని సంఘటన —!

మర్నాడు అతను వొచ్చాడు; తనను చూశాడు. కాని తను అతన్ని చూడలేక పోయింది. ఒక భయంకర దృశ్యంగుండా సాగిపోతూన్నట్టు ఆమెకు తోచటంవల్ల ఆమె దృష్టి పనిచెయ్య లేదు.... తీరా అతను వెళ్ళిపొయ్యాక, మనిషినన్నా చూసినా బాగుండేదనిపించింది. తల్లివొచ్చి అడుగుతే తనుమాట్లాడలేదు. తనమౌనమే అంగీకారంగా తీసుకోబడ్డది.

వివాహ సమయంలోకూడా ఆమె దిగులుగా విచారంగా ఉండిపోయింది. ఇంతదూరం తనెలా రాగలిగిందో ఆమెకే ఆశ్చర్యంగావుంది. ఇష్టా యిష్టాల ప్రసక్తిలేనిపని చేస్తూన్నప్పుడు మనం కాదనే మూఢ నమ్మకం ఇచ్చే ఓదార్పులాటిదేదో ఆమె గుడ్డిగా సాగిపొయ్యేందుకు సహాయం చేసి వుంటుంది.

తీరా మొదటిరాత్రి•అతని బాహుపంజరంలో ఇరుక్కున్నాక-గురితప్పని ఉరితాటిలో మెడ ఇరుక్కున్నట్లూ ఇప్పుడే నిద్రమెలకువ వొచ్చి ఇది కలకాదనే నమ్మకాన్ని రూపించినట్లూ ఆమె గ్రహించింది. అయిందేమో అవనే అవుతుందనే మొండి ధైర్యంతో ఆమె మనస్సు నిండి పోయింది. ఇందాకటినుంచీ అతను లాలించి మాట్లాడి స్తూన్నా తనకు భాషే తెలియనట్టు, మూగపిల్లలాగు ఊరుకోవటం చాలా హాస్యాస్పదంగా తోచింది.....

మరుక్షణంలో ఆమె అతన్ని చూసింది .... ఆనాడు పెళ్ళిపీటలమీద ఎవరినైతేచూసి, లోకంలోని గొప్ప అదృష్టాల్లో అతని భర్తృత్వాన్ని జమకట్టిందో—అతను; ఎలాంటి వాడు తనకు కావాలనుకుందో, ఎవర్నిచూసి తను యీ రెండేళ్ళూ వివాహసమస్యలో ఉక్కిరిబిక్కిరవుతూ, దరీదాపూ కానకుండావుందో—చివరకు అతనే లభ్యమయ్యాడు.

–కాని ఎంగిలాకుదగ్గరికి జేరినట్టుగా ఆమెకు తోచింది ఏ కారణాలవల్లనో కాని, ఆ క్షణంనుంచే ఆమెకు అతనంటే వెలిబుచ్చ లేని అసహ్యాం ఆరంభమైంది.

— మే 1947

# నేరం

అప్పటికే ఆ పెట్టెలో మనిషిమీద మనిషి నిలబడి వున్నారు. బండి స్టేషన్‌లో ఆగగానే ఒక స్థూలకాయుడు మెల్లిగా లోనికి ఎగబాకాడు. తలుపుదగ్గర నిలబడ్డ జనం "చోటు లేదు" అని ఎంత గోలచేస్తున్నా పనిపించుకోకుండా, భుజబలంతో తోసుకుంటూ లోనికి దూరాడు.

లోపల బనీనుకనిపించే సిల్కు చొక్కా, గ్లాస్కో పంచా, జరీఅంచుల ఉత్తరీయ్యమూ కలవాడేనని సూచిస్తూన్నా, నల్లని తుమ్మమొద్దులాంటి శరీరచ్ఛాయా, నిప్పుకణాల్లాంటికళ్ళూ, పైకి ఎగదువ్విన క్రాపూ, టూత్‌బ్రష్‌కు పనికివొచ్చే మీసపుకట్టూ, సంస్కారరహితమైన ప్రవర్తనా— ఇవన్నీ చూసికూడా, "ఇది ఇంటర్‌క్లాసు!" అని తెలియజెప్పే సాహసం ఆ పెట్టెలో ఎవ్వరికీ లేకపోయింది. బహుశా నల్లవాణ్ని పోలిన మనుషులే మరికొందరు, సంస్కారపు బురఖాతో ఆ పెట్టెలో ఉండి వుంటారనేందుకూడా సందేహం లేదు!

వొచ్చినవాడు అందరిలాగే నిలబడకుండా, ఏమేమో గొణుక్కుంటూ, ఒక ముసలాయన్ను "జరగవయ్యా!" అన్నాడు, కఠోరకంఠధ్వనితో.

నలుగురు కూర్చోవాల్సిన చోటులో అప్పటికే ఆరుగురు కూర్చొనివుండటంవల్ల, "ఇక్కడచోటు లేదు" అన్నాడు ముసలాయన.

నల్లవాడు వినిపించుకోకుండా, ఇక మాటల్తో పనిజరగదని కాబోలు—చెప్పిన ఆయన మీదనే కూర్చున్నాడు. స్థూలకాయుడవటంవల్ల నల్లవాడి బరువు సగానికిపైగా పక్కనే వున్న మిలిటరీవాడిమీద పడ్డది. ముసలాయన "కుయ్యో!" మన్నాడు. మిలిటరీవాడు బలంగా నల్లవాణ్ని ఒక్కతోపు తోసి, "నీకేమన్నా బుద్ధివుందా?" అన్నాడు.

"బుద్ధిలేకపోతే మిలిటరీలోనే జేరేవాణ్ని!" అన్నాడు నల్లవాడు.

మిలిటరీవాడు కోపంతో కొట్టేందుకు చెయ్యి ఎత్తేలోపలే; నల్లవాడిగుప్పిట బలాన్ని చవిచూడక తప్పిందికాదు. ఒక్కక్షణంలో ఇద్దరూ కలియబడ్డారు. ఆ చుట్టుపక్కల కూర్చున్న ప్రయాణికులు వెంటనే యీ ఉపద్రవాన్ని గుర్తించి, తమతమ సామానుల్ని జాగర్తగా సర్దుకొని, తమ కాళ్ళను సీటుమీదకు ఎత్తిపెట్టుకొని, ఆతృతతో యీ వినోదాన్నిచూసి ఆనందించసాగారు. వాళ్ళిద్దర్నీ సర్దాల్సిన తమ ధర్మాన్ని ఒక్కరూ గుర్తించలేదు; ఒకవేళ గుర్తించినా, ఆ సాహసంలేక, "మనకెందుకులే!" అని ఊరుకొనన్నా వుంటారు.

రైలుకదిలింది. గొలుసు లాగుతే ఎంత తమాషాగా బండి ఆగుతుందో చూడాలనీ, రైలుమొత్తాన్నే ఆపగలిగిన తమ భుజబలాన్ని ఇతర్లు మెచ్చుకోగా వినాలనీ కుతూహలపడుతూన్న ఇద్దరు కాలేజీ స్టూడెంట్స్ని, ఆపనికి పూనుకునే లోపలే—ఆపద్బాంధవుడిలాగు రైల్వే కానిస్టేబిల్ ఆపెట్టెలో

జొరబడ్డాడు. ఈ పోట్లాట తనప్రాణానికే వొచ్చినట్టు ఒక్క క్షణం అనుమానించి, బండివేగం హెచ్చినందువల్ల దిగి ఇంకో పెట్టెలో ఎక్కే అవకాశం పోయినందుకు నిట్టూర్చి, ఇక తనకు తప్పని తద్దిన మన్నట్టు జనాన్ని తోసుకుంటూ పోయి, "ఏయ్!.... ఏమిటిది?...ఆగండి" అని గద్దించి, ముఖ గాంభీర్యంతో ఎలాగో వాళ్ళిద్దర్నీ విడదియ్యగలిగాడు.

వెంటనే జేబులోంచి నోట్‌బుక్ తీస్తూ, నల్లవాణ్ణి ఉద్దేశించి, "నీ పేరేంటి?" అన్నాడు.

"నా పేరెందుకోయ్?"

"తాగి గోలచేస్తున్నందుకు"

"ఏం తాగితే?...." అని తృప్తికరంగా తను తాగినట్టు సూచించేందుకు ఒకసారి తేపి, మేమిద్దరమూ కుస్తీ పడుతూంటే — మధ్య నువ్వెవడివిరా?" అని తూలిపడబోయి, పైనిచెక్కను పట్టుకొని, నిలవదొక్కుకున్నాడు.

"స్టేషన్ రానీ — నీ పని పడతా!" అని పోలీసు మీసం దువ్వాడు; ఇక్కడ తనకు బలంలేనందుకు లోలోపల విచారపడి వుంటాడు.

కాస్త ఆగి, "నీటిక్కెట్టుఏదీ?" అన్నాడు పోలీసువాడు కొత్తమార్గాన్ని ఆలోచించి.

"నన్నపడ్డా టిక్కెట్ అడిగేది? ముందు నీటిక్కెట్ ఏదీ?"

"చూపిస్తాలే—ఆగు!"

పోలీసువాడి ముఖం రోషంతో ఎర్రబడ్డది. ఇంత వరకూ జరిగిన కథనంతట్నీ విని, తూష్ణీంగా జీర్ణించుకున్నాడు—పోలీసువాడు.

ఇంతలోకే స్టేషన్ రావటంవల్ల బండీఆగింది. అది జంక్షన్ కావటంవల్ల—పోలీసువాడు, ఇంకో పోలీసువాడి సహాయంతో నల్లవాణ్ని బలవంతాన స్టేషన్‌కు లాక్కుపోయ్యాడు. జనసమూహం యీ వింతను చూసేందుకు రైల్వే పోలీసుస్టేషన్ ముందు గుమికూడారు. అసలు విషయం ఎవ్వరికీ తెలియకపోయినా, జేబుదొంగతనమై వుంటుందని వూహించి, ఆ కథనే తమలో తాము ప్రచారం చేసుకోసాగారు!

ఆ పెట్టెలో ప్రయాణంచేసే ఇద్దరి దగ్గర్నుంచి—నల్లవాడు తాగిగోలచేస్తూ, వృధాగా ప్రయాణీకుల్ని కొట్టబోయ్యాడని సాక్షి స్టేట్‌మెంట్లు తీసుకోబడ్డవి.

బండి బయలుదేరేందుకు గంట కొట్టగానే జనమంతా వెళ్ళిపొయ్యారు పోలీసువాడి డ్యూటీ యీ స్టేషన్‌తో ఐపోవటంవల్ల, బండిని సాగనంపేందుకు వొచ్చి, తనశూరత్వాన్ని చూడమన్నట్టు తలఎత్తి నిలబడ్డాడు. రైలుమాత్రం ఇదేమీ తనకు పట్టనట్టు మామూలుగా సాగిపోయింది.

బండి వెళ్ళగానే నల్లవాణ్ని మెత్తగా తన్నారు. కాని, నల్లవాడు నిషాలో ఒళ్ళుతెలియని స్థితిలో వుండబట్టి ఆ దెబ్బల్ని పూర్తిగా అనుభవించలేక పొయ్యాడు. తన్ను తన్నుకూ చావబోయ్యే కుక్కలాగు సన్నగా, జాలిగా

మూలిగాడు. చివరకు పోలీసులకు విసుగెత్తి జైలుతలుపు తాళాం వేశారు.

అర్ధరాత్రికల్లా నల్లవాడికి నిషాపూర్తిగా దిగిపోయింది. గత సాయంత్రం తిన్నదెబ్బల మజా బాగా తెలిసివొచ్చింది. అతని ఆకలి విజృంభించింది. ఇది ఇంకా రైలు పెట్టేనని నిద్ర కళ్ళతో ఆలోచించివుంటాడు.

"ఎవడ్రా?" ....ఎవడ్రా?" అంటున్నాడు.

"ఉస్ .... మాట్లాడవోక .... పడుకో!"

నల్లవాడు లేచికూర్చొని కళ్లు తుడుచు కున్నాడు. ఆ మెలుకువలో ముందున్న ఇనుపచువ్వల్ని చూసి, ఇది జైలని వెంటనే గ్రహించాడు.

"కాసిని మంచినీళ్ళివ్వు బాబూ!" అన్నాడు. ప్రార్థనా స్వరంలో, తన బాహుబలమూ, దబాయింపూ ఏమీ లాభం లేదని గ్రహించేందుకు వాడికి ఎంతో సేపు పట్టలేదు. బైటినుంచి జవాబు లేదు.

"అబ్బ!....దాహం! .... మంచినీళ్ళు .... స్వామీ! మంచినీళ్ళు!...."

"అర్ధరాత్రి — ఏంటోయ్ .... పడుకో" అన్నది, కాపలావాడి కంఠం.

"పీకె ఎండి చస్తాను"

"చావు!" జైలు పాడు పెట్టాల్సివొస్తుందన్న భయమన్నా కాపలావాడికి లేదు!

"బాబూ! కాస్త పుణ్యం కట్టుకో"

తెల్లవాళ్లూ యీ గోలతో నిద్రపట్టదని, కాపలా వాడు విసుక్కుంటూ లేచి మంచినీళ్ళు ఇచ్చాడు.

"బాబూ! ఆకలవుతోంది"

"ఇక్కడ తినేందుకేమీ లేవు"

"నా దగ్గర డబ్బులున్నయ్"

డబ్బుమాట వినగానే కాపలావాడి ముఖం వికసించింది.

"సరే—తే" అన్నాడు.

నల్లవాడు ఐదురూపాయిల నోటుఇచ్చాడు. కాపలా వాడు పళ్ళూ, ఫలహారాలూ తెచ్చాడు. నల్లవాడు అవి తిని ఆకలితీర్చుకున్నాడు. నల్లవాడు డబ్బు లెఖ్ఖఅడగనూ లేదు; కాపలావాడు చెప్పనూలేదు అదీ మర్యాద!

దెబ్బలబాధను నల్లవాడు భరించలేకపోతున్నాడు.

"బాబూ! ఆ మిలిటరీ వెధవ వొళ్ళంతా నలగ బొడిచినట్టున్నాడు—"

"పడుకోవయ్యా!" అన్నాడు కాపలావాడు విసుగ్గా.

"నన్ను ఎప్పుడు వొదిలిపెడతారూ!"

"రేపు మేస్ట్రేటు కోర్టులో శిక్షవేశాక!"

"మళ్ళీ జైలా! బాబూ!" అని నల్లవాడు తన దురదృష్ట దేవతకు ఏడుస్తూ దండకాన్ని పఠించసాగాడు.

"ఏంటయ్యా—యీ గోల?"

"ఏంచెయ్యమంటావూ? దగ్గర్లో ఎక్కడన్నా కాస్త మందు దొరుకుతే....?"

"మం దేమిటి—నీ తలకాయ ?"

"బ్రాందీ, బీరూ, కనీసం సారాయీ — నాదగ్గర డబ్బులున్నయ్ లే ........ మనిద్దరమూ తాగి హాయిగా పడుకుందాం—"

"ఎంత వుందయ్యా?"

"డైభైదాకా వుంది"

"ఏం చంపుకుతింటున్నావయ్యా! ఉండు మనవాళ్ళను పిలుస్తాను"

ఐదునిమిషాల్లో ఐదుగురు కానిస్టేబిల్సొచ్చారు. అందరూ తమకు జరగబొయ్యే విందును అనుభవించేందుకు ఆనందంతో వున్నారు.

ఇంకో పదినిమిషాల్లో నల్లవాడూ, ఆరుగురు బేగ్రేసు పోలీసులూ కలిసి, స్పెన్సర్ లో ఎలక్ట్రిక్ ఫాన్ కింద, గొంతుదాకా గొట్టెలుతింటూ కూర్చున్నారు.

"ఒరేయ్!....నూటపది హేడూ! ఎక్కడచచ్చార్రా వెధవలు!"

అందరూ అదిరిపడ్డారు. సబ్ ఇనస్పెక్టర్ స్టేషన్ బైటనిలబడి, ప్లాట్ ఫారమంతాదద్దరిల్లేట్టు రంకెలు పెడుతున్నాడు. నూటపదిహేడుగాడు ముందుకు పరుగెత్తాడు.

నల్లవాడు స్పెన్సర్ బిల్లు యాంభై ఎనిమిది రూపా యిలూ చెల్లించాడు. మిగతావాళ్ళు నల్లవాణ్ని తీసుకొని స్టేషన్ వైపు బయలుదేరారు.

"ఎక్కడ చచ్చార్రా?" అన్నాడు సబ్ ఇనస్పెక్టరు.

"నల్లవాడు పార్టీ చేశాడు సార్! మిమ్మల్ని పిలుద్దా మంటే నిద్రపోతున్నారు"

"ఎవడ్రా వీడు?"

"ఫిఫ్టీపోర్‌లో తప్పతాగి రైలుపెట్టెలో న్యూసెన్స చేశాడు సార్!"

"అంతా వొదిలించారా?"

"ఇంకా ఉన్నట్టుంది సార్!"

"ఉంటే చూస్తావేరా వెధవా! నిద్రపట్టక ఛస్తూంటే-"

"ఆఫీసరుగారికి బుద్ధి తెప్పించు" అన్నాడు కాపలా వాడు, అధికార స్వరంతో.

"నాదగ్గర ఇంకా పదమూడు రూపాయిలే ఉన్నాయ్. నేను రేపు బెజవాడ పోవాలి—"

"రేపు మేస్ట్రేటు కోర్టులో అది వొదిలి, జైలుకు వెళ్తావ్"

మేస్ట్రేటు కోర్టుమాట వినేప్పటికి నల్లవాడి గుండెలు జారినై; లోగడ వాడికి దాని అనుభవం బాగా ఉండి వుంటుంది.

"తే....అంతా తే!" అన్నాడు కాపలావాడు. మరి గత్యంతరంలేక నల్లవాడు జేబంతాదులిపాడు. స్పెన్సర్‌నుంచి

బుడ్డి రాగానే, సబ్ ఇనస్పెక్టర్ అడిగాడు: "ఏడిమీద డైరీ రాశారా ?"

"నూటపధ్నాలుగు పట్టుకున్నాడు సార్....డైరీ రాయలేదు—"

"సరే....ముందు వీణ్ని స్టేషన్ బైటి దాకా సాగనం పిరండి"

"ఈ ఊరు నాకుకొత్త. ఇక్కడ పడుకో నీండి రేపు ఊరువెళ్ళేందుకు నాదగ్గర డబ్బు ల్లేవు" అని నల్లవాడు గోల పెడుతున్నా, వినకుండా, ఇద్దరు పోలీసువాళ్ళు వాణ్ని స్టేషన్ పొలిమేరల్లోకూడా లేకుండా నెట్టి, చేతులు దులుపుకున్నారు.

సబ్ ఇనస్పెక్టరు బుడ్డి ఖాళీచేసి, నిషాలో రంకెలు వేయ సాగాడు. మిగతా పోలీసులు కూడా ఆ ఆనందంతో తమలో తాము వేళా కోళాలు ఆడుకొని, విసుగెత్తి స్టేషన్ అంతా దద్దరిల్లేటు రాంభజన మొదలుపెట్టారు.

ముసలి స్టేషన్ మాస్టరూ, చాలామంది ప్రయాణీకులూ, స్టేషన్ చుట్టూ మూగారు.

"ఏమిటీ యీనూ్యసెన్స్;" అన్నాడు స్టేషన్ మాస్టరు.

కాని పోలీసువాళ్లెవరూ జవాబు చెప్పలేదు; వాళ్ళ రాంభజన క్లయిమాక్స్‌లోవుంది కనుక, అసలు వినిపించు కోనే లేదేమో !

ఇద్దరు పోలీసులు దేహారోగ్యం కోసం కుస్తీపడు తున్నారు. ప్రేక్షకులు ఆశ్చర్యంతో అలాగే నిలబడి పోయ్యారు.

— డిశంబరు, 1946

# అంటువ్యాధులు

"నువ్వు ఎంతో మంచివాడవని మన స్నేహితులందరూ అనుకుంటున్నారు" అన్నాడు, సత్యనారాయణ.

ఈ మాటల్తో నా ముఖం వికసిస్తుందని వాడు అభిప్రాయపడ్డాడు కాని, ఇలా దిగులుగా చూస్తానని వాడు అనుకోని వుండడు; వాడి ముఖంలోని డిసప్పాయింటుమెంటును చూస్తూనే నే నది గ్రహించగలిగాను.

"నాకు అంతకన్న పరమ శత్రువు—"

"శత్రువా ? ఆడదా ? మొగాడా ?"

"ఆడో మొగో నేను నిర్ధారణగా చెప్పలేను. మన మంచితనంకన్న ఆ గర్భశత్రువు మరి వుండదు."

"అదా విషయం?....ఏం అలా అన్నావ్ ?"

"వీళ్ళందరికీ నేను మంచివాణ్నెందుకయ్యానో తెలుసా ? అడిగినవాడికల్లా డబ్బు అప్పిచ్చి, నా చేతకాని తనాన్ని కప్పిపుచ్చుకుంటూ తలకుమించిన సహాయాలు చేస్తూ వొచ్చినందుకు—"

"దానికి వాళ్లు కృతజ్ఞులుగా వుండి— నిన్ను మంచివాడని అంటున్నారేకాని — దుర్మార్గుడని అనటంలేదే! అదీకాక— నువ్వు ఇచ్చిన డబ్బు అప్పుగానే కాని, ధర్మంగా కాదుగా ! అందుకని నువ్వు ఇచ్చిన డబ్బు ఇక్కడ లంచంగా కూడా చలామణీ అవదు."

"అప్పనేమాట అడ్డమేకాని- నిజానికి అది ధర్మమే!"

"ధర్మమా? ఎట్లా?"

"ముందు అప్పుగా ఇమ్మనే అడుగుతారు.... మనం ఇస్తాం. కాని తరువాత అది మన చేతికివొచ్చి ఛస్తేగా?"

"రాక ఏమౌతుందీ! ఒకవేళ మరిచిపోయి వుండొచ్చు. నువ్వు కాస్త జ్ఞాపకంచేసి తిరిగి తీసుకుంటే సరి."

"మరిచిపోవటం హాస్యాస్పదం. ఒకవేళ అదే నిజమైతే అలా మరిచిపొయ్యేవాణ్ని 'కృతజ్ఞుడు' అని తెలుగులో అనరు, చేసినమేలును మరిచేవాడు కృతఘ్నుడు!.... అడగటం అంటే మాటలా? స్నేహమనేది వొకటి అడ్డం వుందిగా! అడుగుతే ఏమన్నా అనుకుంటాడేమోననే భయం; అసలు అడిగే స్వభావంకూడా మనకు లేదాయె! ఏదోవిధంగా ఒకటికి రెండుసార్లు అడిగి ఒత్తిడి కలిగించామంటే— ఇంకేముందీ - మనతో మాట్లాడటం మానేస్తారు. ఊళ్లో మననుగూర్చి దుష్ప్రచారంకూడా సాగిస్తారనేందుకు సందేహం లేదు."

"అది నీలోని బలహీనత...."

"దాన్నే వాళ్లందరూ 'మంచితనం' అనే మారు పేరుతో పిలుస్తున్నారు."

రెండు నిమిషాలు ఆలోచనలోపడి "తీసుకున్న పైకం తిరిగి ఇవ్వలేనివాళ్ళు అసలు అప్పుగా తీసుకోవటం దేనికీ?" అన్నాడు సత్యనారాయణ.

"ధర్మంగా అడుగుతే ఎవరిస్తారూ? వాకిట్లోకి వొచ్చిన బిచ్చగాడికీ, ధర్మంగా అడిగే స్నేహితుడికీ— దుస్తుల తీరులో తప్ప ఇంకేమీ భేదంలేదు."

"ఇప్పుడు నీకు వెంకటేశ్వర్లు ఎంత ఇవ్వాలీ?"

"వంద"

"వందా?.... కృష్ణమూర్తీ?"

"డబ్భైబయ్—మొత్తం మూడు వేలకు తక్కువకాకుండా లిస్టువుంది —"

"మూడు వేలే"

"మరేమనుకున్నావ్? మూడు సంవత్సరాలనుంచీ ఇంత ఖర్చుపెడుతూ వీళ్ళందరిచేతా మంచివాణ్ని అనిపించుకోవటం మాటలా? ఎవర్ని కాస్త కదిలించినా విషయాన్ని తప్పించి మాట్లాడుతారు. వాళ్ళేమో నాకుటోపీ వెయ్యగలిగినట్లూ, నాకన్న గొప్ప తెలివితేటలు ఉన్నట్లూ చూస్తూ—టలాయించి తిరుగుతారు. ఒక్కోచోట నన్నొక అపరిచిత వ్యక్తినిగా చూస్తారు. నేను గ్రహించగలిగిందేమిటంటే— ఈ విషయంలో ఏ కాస్త ముందుకుపోయినా— రానిడబ్బు రాకపోగా పైపెచ్చు విరోధాన్నికూడా కొని తెచ్చుకోవాలి—"

"ఇలాగైతే జీవితం ఎలాసాగుతుందీ?"

"అంతకన్న మరిగత్యంతరంలేదు సాగి సన్నాళ్ళే— ఏం చేస్తాం?"

సత్యన్నారాయణ ముఖం కొత్త ఆలోచనలో పెరిగింది. అన్నాడు; "ఒక విధంగా ఆలోచిస్తే నువ్వు మంచివాడివనే కీర్తికోసం పాకులాడుతున్నట్టు తోస్తుంది—"

"నేనెప్పుడూ అలాంటి కీర్తికోసం ప్రయత్నించలేదు. దానంతటది అది టన్నుల కొద్దీ వొచ్చి పడుతూవుంటే.... నేనొక్కణ్నీ భరించలేక ఛస్తున్నాను. ఆ మంచితనం నాకు చేసిన మేలేమీ లేకపోయినా, కీడు చేస్తోంది; అలాంటిదాన్ని హృదయపూర్వకంగా ఆహ్వానించగలిగే ధైర్యం నాలాంటి సామాన్యుడికి ఉండటం — నిజంగా అసహజమే!"

"నీ గొడవ నాకు అంతుపట్టటంలేదు. కాస్త కఠినంగా ప్రవర్తించకపోతే మిగిలిన మూడు ఎకరాలుకూడా అమ్మెయ్యాల్సి వొస్తుంది. ఇక సంసారం సంగతి వేరేచెప్ప నక్కర్లేదు. ఇదంతా నీలోపమేననేందుకు నాకో మంచి కారణం కూడా కనిపిస్తోంది"

"ఏమిటది ?"

"నన్నెవరూ అడగరేం ?" తన తెలివి తేటల్ని నేను మెచ్చుకోవాలని కాబోలు నాముఖంలోకి సూటిగా చూశాడు.

"అడిగినా లేదని నిర్మొహమాటంగా అనేస్తావ్. అసలు నీదగ్గర్నుంచి డబ్బు రాల్తుందనే నమ్మకం ఎదుటివాడికి ఎలాకలుగుతుందీ? ఎప్పుడు చూసినా జేబులో చిల్లర తప్ప ఇంకేమీ ఉండదాయె! ఇంకోడు నిన్ను అడిగే

ముందు — నువ్వే వాణ్ణి అడిగేస్థితిలో ఉన్నావనే అభి ప్రాయాన్నికూడా కలిగించక మానవు—తెలసిందా ?"

సత్యన్నారాయణ తెలిసినట్టుగా తల ఆడించి నవ్వు కుంటూ వెళ్ళిపొయ్యాడు.

## 2

"ఇంత మారిపోతావనుకోలేదు; ఇలాంటి దుస్థితికి వొస్తా వనుకోలేదు" అన్నాడు పాత స్నేహితుడు సూర్యనారాయణ.

"నన్నుగూర్చిన విచారం నాకేమీ లేదు. ఇక నీకు దేనికి ?"

"స్నేహితుణ్ణి కనుక .... నిన్నుగూర్చి నువ్వెప్పుడూ ఆలోచించకపోవటంవల్ల విచార పడాల్సిన విషయాం నీకు కనిపించలేదను కుంటాను."

"పోనీ—ఇప్పు డావిచారాన్ని కొనితెచ్చు కోవటం దేనికీ ?"

"కొద్ది రోజుల్లోనే నీకు పిచ్చికూడా ఎక్కేట్టుంది.... ఉండేందుకు ఇల్లులేకుండా అమ్మకున్నావు. చారెడు గింజల క్కూడా గతిలేకుండా పది ఎకరాలభూమినీ అమ్మికూర్చు న్నావు. తాటివనంకూడా అమ్మావుటే! ఇంకా విచారపడేం దుకు ఇంతకన్న ఇంకేంకావాలి?"

"ఇండియా గవర్నమెంటుకు ఏ పన్నురూపంలోనూ నాదగ్గర్నుంచి దమ్మిడీకూడాపోదు. కాగా, ప్రతి ఇతర పౌరు డికీవున్న హక్కులు నాకూ వున్నయ్ —"

"నీకు ఇంకా యీ బింకం ఉండటం ఆశ్చర్యంగానే వుంది!"

"దీన్నికూడా అమ్మ లేదనా నీఆశ్చర్యం ?"

"ఇంత మొండిగా మారావేం ? మొన్న మీ మామ గారు కనిపించి నీ స్నేహబృందమంతా జేరి నిన్నుసర్వమంగళం చేశారని చెప్తే విని ఎంతో విచారపడ్డాను. భార్యాబిడ్డల గతేంకానూ? ఏదన్నా ఉద్యోగమన్నా చెయ్యి—అంతకన్న ఇంకేం వుందీ ?"

"వెధవ ఉద్యోగం !"

"ఐనా నాకు తెలియక అడుగుతాను—నీకు యీ స్నేహితులు ఎందుకంట ? ఒక తాగుడు లేదు. బాగా అనుభ వించింది లేదు; ఐదుసంవత్సరాల్లో ఇంతడబ్బు ఖర్చయిం దంటే—దానికి కారకులు నీ స్నేహితులు! ఇప్పటికన్నా వాళ్ళను వదలవేం ?"

"ఎట్లా వొదులుకునేదీ ? డబ్బుతో కొనుక్కున్న స్నేహమాయె ! చూస్తూచూస్తూ ఎలా విసిరిపారేసేదీ ?"

"పోనీ వాళ్ళవల్ల నీకేమన్నా మేలు కలుగుతుందా?"

"ఆఁనన్నుకూడా వాళ్లబృందలో కలుపుకున్నారుగా?"

"మరి ఇన్నాళ్ళూ ?"

"ఇన్నాళ్లూ నేను వాళ్లదగ్గర ప్రాపకం కోసం వాళ్ల ఖర్చుల్ని భరించే వ్యక్తిని, ఇప్పుడువాళ్ళే—"

"వాళ్ళు నీకింద ఏమన్నా ఖర్చు పెడుతున్నా రంటావా ?"

"వాళ్ళ జేబుల్లోంచి కాకపోతే మాత్రమేం ? మొదట్లో నన్ను వెతికితెచ్చినట్టే — ఇప్పుడు మేమందరమూ కలిసి ఉన్నవాణ్ని ఇంకోణ్ని పట్టుకొచ్చి—తలాకాస్త పిండు కుంటాం ! ఆ పిండుకునే వాళ్ళలో ఇప్పటికి నాకూ కూడా వొకస్థానం లభించింది."

"వాడు పిండుకోనీవొద్దూ ?"

"అది మన ప్రావీణ్యత—దాన్ని ఎవ్వరూ అప లేరు. నే నేం అడ్డగించ గలిగానూ ? స్నేహం ఉండనే ఉందామె ! కొత్తవాడికి యీ స్నేహాన్ని వొదిలించుకుందా మనే దురుద్దేశం వున్నా— మేము వొదలమామె !"

"అంటే వాణ్ని నీలాగే సర్వమంగళం చేసేదాకా-?"

"అంతే !"

"జలగ వ్యవహారంగా వుందే !"

"కాని మేము జలగలాగు కాకుండా—బాధకనిపించ కుండా —క్లోరోఫారం కిందచేసే ఆపరేషన్‌లాగు —పీల్చ గలం !"

"మత్తు తెలిశాకన్నా—?"

"అప్పటికి మిగిలిం దేముంటుందీ ? నాలాగే పాపర్ ! అప్పటికికాని మా జలగల సంఘంలో వాడికి సభ్యత్వం లభించదు."

"నువ్వు ఇంతడబ్బూ తగలేసి చివరకు నేర్చింది యీ కళన్నమాట? ఈ సంగతి వింటే నిన్ను ఎవడైనా జేరనిస్తాడూ? ఇలా గోముఖ వ్యాఘ్రంగా...."

"నా సంగతి ఊళ్ళో విచారించు—ఏమంటారో?"

"అదే నాకు ఆశ్చర్యంగా వుంది. ఇంతదురాత్ముణ్ణి 'మంచివాడు' అని లోకులు ఎలా అనగలుగుతున్నారంట?"

"మరి నేను పెట్టిన లంచం! ఇన్నాళ్ళూ నేను వాళ్ళ కింద ఖర్చుపెట్టిన డబ్బు! నీకు మంచితనం పర్వతాల పరిమాణంలో కావాలంటే—"

"నాకు వొద్దు బాబూ!"

"ఏం భయంలేదు....ఇదీ వొకరకం వ్యాపారమే అనుకో. నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్ల లాటిది....ఉత్తరోత్తరా క్రమంగా అంతకు రెండింతలు రిటరన్ వొస్తుంది—తెలిసిందా?"

"నాకు అంతా అయోమయంగా నేవుందీ. ఐనా ఇలా స్నేహితుల ధర్మాలమీద ఎన్నాళ్లు బతుకుతావ్?"

"ధర్మమేమిటీ—నీమొహాం? అప్పు! మన జీవితం పట్టాల్ని అంటిపెట్టుకొని పరుగెత్తే రైలులాగు ఒడిదుడుకులు లేకుండా సాగిపొయ్యే అయోమార్గం!"

"ఇక్కడ నీ స్నేహితులేగా పట్టాలు? కాని—రైలు పట్టాలు జరగవు, వీళ్ళు జరుగుతూ వుంటారు కనుక, నువ్వన్న రైలు ఎప్పుడో అప్పుడు తలక్రిందులుగా పడక మానదు."

"ఆ పట్టాపోతే—ఇంకో కొత్తపట్టా తెచ్చి వేస్తాం—"

"పోనీ స్నేహితులదగ్గర చేసే అప్పు మాత్రం ఎట్లా తీర్చగలవూ ?"

"తీర్చటం దేనికీ ? నేను ఇప్పటికి అప్పుగా ఇచ్చిన పైకమంతా వొస్తే పోగొట్టుకున్న ఆస్థినంతా కొనగలను !"

"అప్పు తీర్చకపోతే ఊరుకుంటారా?"

"నేనేం చెయ్యగలిగానూ ? అందరూ అంతే ! స్నేహంలో తీసుకున్న అప్పును తిరిగి అడిగి స్నేహాన్ని పోగొట్టుకుంటారా యేం ?"

"ఇట్లా ఎన్నిసార్లూ ?"

"ఒక్కో స్నేహితుడి తాహతునుపట్టి ఒక్కోసారే చాలు. కొత్త సభ్యులు వొస్తూనే వుంటారు !"

"ఇలాగే ప్రతివాడితోనూ వాగుతూవుండు. నీ స్నేహాన్ని ముందుగానే అర్థంచేసుకొని నీ వీపు చెడగొట్టి పోతాడు—తెలిసిందా ?"

"మరేం ప్రమాదంలేదు. ఒకసారి సత్యన్నారాయణకు ఇదంతా చెప్పాను—"

"ఏ సత్యనారాయణ ?"

"ఆ పుస్తకాల షాపులో వుండడూ —"

"ఆఁ, పొద్దున నిన్నుగూర్చి గంటసేపు కీర్తించాడు .."

"వాడుకూడా మన ఖాతాదారుడేలే! .... అంతావిని నాతో విరోధం పెట్టుకుంటాడేమో ననుకున్నాను. కాని ఆనాటినుంచీ మరీ అంటిపెట్టుకొని తిరగటం మొదలు పెట్టాడు. నెలతిరిగేప్పటికి రెండువందలూ అప్పుతీసుకున్నాడు —"

"తీసుకొని ఇచ్చాడా?"

"ఈ దేశంలోనూ, ప్రత్యేకించి మా సంఘంలోనూ అలాటి ఆచారమే లేదన్నాగా! ఆనాటినుంచీ వాడికి నే నెంతో మంచివాణ్ని!"

"నీమాటలు వింటూంటే నాకు పిచ్చెక్కేట్టువుంది.. పన్నెండయింది....యీ ఒంటిగంట బండికే వెళ్తాను—"

"వెళ్తే వెళ్ళావ్ కాని - నీదగ్గర వొక యాభైరూపాయిలుంటే ఇచ్చివెళ్ళు - నెలాఖరుకు పంపుతాను."

సూర్యనారాయణ బిత్తరపోయిచూసి, పెదవులదాకా వొచ్చిన మాటల్ని బలవంతాన బైటపడనీకుండా లోలోపలే గొణుక్కున్నాడు.

"మరేం భయంలేదు లేవోయ్. కావాలంటే నీకు నోటురాస్తాను—"

వాడు జవాబు చెప్పలేక, మాట్లాడకుండా యాభై రూపాయిలూ ఇచ్చి, రిక్షాఎక్కి "త్వరగా—స్టేషన్కు" అని తనవెనుక ఏదో వన్యమృగం ఉన్నట్టు, తిరిగన్నా చూడకుండానే సాగిపొయ్యాడు.

నేను ఇంతకుముందే అప్పుగా సంపాయించిన పైకాన్ని జేబులో పెట్టుకొని, స్నేహబృందంలోని సభ్యులు ఎక్కడ ఎదురౌతారో ననేభయంతో - సందుగొందుల్లో నుంచి ఇంటిదారిపట్టాను.

— ఫిబ్రవరి, 1947.

# విరోధి

నాటకం పూర్తవగానే కాంతమ్మ మాటలు జ్ఞాపకానికి వొచ్చినయ్. ఆమె అనేది : "ఏదో పల్లెటూళ్ళో వున్నా— మాకూ అంతో, ఇంతో వుంది. ఏదన్నా పనిమీద ఎప్పుడన్నా మేం పట్టణానికి వొచ్చి చూసిపోతూంటాం కాని— దారి తప్పయినా ఒక్కసారన్నా మావూరు రావుకదా! వొస్తూ పోతూంటే చుట్టరికం కాని, లేకుంటే—?"

"వొస్తాను, .... వీలుచూసుకొని ఒక్కసారన్నా వొస్తాను" అని ఐదారుసార్లు ఆమెకు వాగ్దానం చేశాను.

ఇక్కడికి వాళ్ళవూరు మూడుమైళ్ళే! ఒక్కసారేన్నా వాగ్దానాన్ని చెల్లిద్దామనిపించింది. మరి రెండురోజులదాకా నాటకాలు కూడా లేవు. కాంతమ్మ దూరపుబంధువు కాదు; పినతండ్రి కూతురే!

నన్నుచూడగానే ఆమె గుర్తించలేక పోయింది. అంతగా మారిపొయ్యాననికాదు; ఆ పల్లెటూరు ఎలా రాగలిగానా అని.

"దారితప్పి వొచ్చినట్లుందే!" అందామె.

"దారితప్పితే—మీ పక్కవూరు జేరే వాణ్ని."

చాలాకాలంనుంచీ వేచివున్న అతిథికిలాగు—ఎంతో మర్యాద జరిగింది. పిండివంటల్తో తయారైన భోజనాన్ని తృప్తిగా తిని, మధ్యాహ్నం నిద్రపోయి రాత్రి బడలిక తీర్చుకున్నాక, కాంతమ్మ తన సంసారపు గొడవలు చెప్పనారంభించింది.

—"ఇక్కడ సుఖానికి యేమీ తక్కువ లేదుకాని—అత్తగారు మాత్రం మహా గయ్యాళి. ఎంతశ్రమపడి పని చేసినా ఆమెకు నచ్చదు. అదేం ఖర్మమోకాని రోజు కొకసారన్నా పోట్లాడుతుంది. ఆమెతో వేగటం—మహాకష్టం!"

ఈ విషయాన్ని వినటం ఇది మొదటిసారి కాదు, అప్పుడప్పుడు మా ఇంటికి వొచ్చిపొయ్యే బంధువర్గం అనుకుంటూండగా అనేకసార్లు విన్నాను.

"మీ మామగారో?" అన్నాను.

"ఆయం దేముందీ—పిచ్చి బ్రాహ్మడు? ఒక మూల కూర్చొని విస్తళ్లు కుట్టుకుంటూ వుంటాడు. *కాస్త పూర్వ కాలంవాడు కనుక, కాస్త మడీ ఆచారమూ లేందే ఆయనకు గిట్టదు. ఆయన మంచితనాన్ని అత్తగారు ఏమీ సాగనివ్వదు. రోజు కొకసారన్నా ఆయన్ను తిట్టిపోస్తుంది—"

ఇంతలో అత్తగారుపిలుస్తే కాంతమ్మ వెళ్ళిపోయింది. మరి పదినిమిషాల్లో దొడ్లో కేకలు వినపడ్డయ్. ఏమిటోనని వెళ్ళాను. కాంతమ్మకూ, అత్తగారికీ, వాగ్వాదం జరుగుతోంది. కొత్తవాళ్ళకు అదొక పెద్ద పోట్లాటగా కనిపించటంలో ఆశ్చర్యంకూడా లేదు.

"అంత అవసరమైతే వేసుకోలేకపొయ్యావా-?" అంటోంది కాంతమ్మ.

"వానకు తడుస్తే పొయ్యిమండదు. కాసినికట్టెలు పాకాలో వెయ్యలేక పొయ్యావా అన్నందుకు అంతకోపం దేనికి?" అంది, అత్తగారు.

కాంతమ్మ నన్ను చూసేప్పటికి మరీరెచ్చింది. తనకు నేను అండగా దొరికినట్టు భావించి వుంటుంది.

"పైనకూర్చొని పని పురమాయించటం నాకూ చేతవ్వు, పనిచెయ్యటమంటూవొస్తే - వేరు" అంది కాంతమ్మ చేతులు వికారంగా తిప్పుతూ.

ఇదే సమయంలో కాంతమ్మ భర్తవొచ్చి తొంగిచూసి బూచాణ్ని చూసిన చిన్నపిల్లాడిలాగు, మాట్లాడకుండా త్వర త్వరగా నిష్క్రమించాడు. ఇలాటి సందర్భాన్ని ఎదుర్కోవాల్సి వుంటుందని నేను అనుకోలేదు; అలాటి అనుభవంకూడా నాకు లేదు. కాసేపు ఆగితే వీళ్ళిద్దరూ నాతీర్పుకోసంవొస్తా రనేందుకు సందేహంలేదు. అప్పుడు నా అవస్థ ఇంకా ఘోరంగా మారుతుంది.

ఏమైనా కాంతమ్మ భర్తలాటి అనుభవశాలే, తప్పుకు తిరగటం ఎంతమంచి తెలివైనపనో నాకు ఆదర్శంగా సూచించాడు. మెల్లిగా నేనుకూడా వెనక్కు తిరిగాను.

"అదికాదు అన్నయ్యా!" అంటూ కాంతమ్మ వెంట పడ్డది.

ఇక తప్పుకుపొయ్యే అవకాశంకూడా మించిపోయింది. ఇద్దరూ కలిసి నాకు విషయాన్ని బోధపరిచారు, కాని ఎటు చెప్పేట్టూ? కాంతమ్మ అత్తగారుకూడా మాకు కొత్త చుట్టం కాకపోవటం మరీ ఇబ్బందైన విషయం. ఇంతచిన్న విషయం మీాద పోట్లాడు కోవటం నిజంగా హాస్యాస్పదం. ఆసంగతి

వాళ్ళిద్దరికీ అర్థమయ్యేట్టు చెప్పటం-నాకు మించిన విషయం! మాట్లాడకుండా ఊరుకోవటం, మాట్లాడటంకన్నా ప్రమాదం!

"ఉండండి....ఇప్పుడే వొస్తాను" అని ఎలాగో బైట పడ్డాను.

ఊళ్ళో అటూ ఇటూ తిరిగి, రాత్రి చాలా పొద్దు పొయ్యాక, కొంపజేరాను. గాలివాన వెలిశాక ఆ చిహ్నాలు కనిపిస్తూన్నట్లు, పోట్లాట పూర్తయినా ఆ బాపతు ఛాయలు ఇంట్లో ఇంకా కనిపిస్తూనే వున్నయ్. నాకు ఆకలవుతూన్న మాట నిజమేకాని, ఆసంగతి ఎవరికి చెప్పుకోనేదీ? అలాగే యీరాత్రి బాధపడి, తెల్లారగానే వెళ్ళిపోదామని ఆలోచిస్తున్నాను.

నా రాకను ఎప్పుడు గుర్తించిందో కాని, కాంతమ్మ వొచ్చి, "లే అన్నయ్యా! వొడ్డించాను" అంది.

బతికిపొయ్యాను! ఇంత తెలివైన పిల్లను, అత్తగారు సక్రమమార్గంలో ఎందుకు ఉపయోగించుకోలేక పోతోందో నాకు అర్థమవలేదు.

భోజనం చేస్తూండగా కాంతమ్మ చెప్ప నారంభించింది: "రోజూ ఇంతే నన్నయ్యా? . ప్రతి చిన్నవిషయానికీ పురమాయింపే! అధికార పూర్వకమైన ఆమె గొంతు--!"

"ఆమె వింటుంది—ఊరుకో" అన్నాను.

"ఏడిసిందిలే!"

కాంతమ్మదృష్టిలో అత్తగారిస్థానం నాకు ఇప్పుడే అర్థమైంది.

"సాయింత్రం నువ్వుచూశావుగా— రాక్షసిలాగు నా మీద ఎలా విరుచుకు పడ్డదో?"

ఈ విషయంమీద చర్చించటం నాకంత క్షేమకరంగా తోచలేదు. ఇక ఇంతటితోనన్నా ఇది మాసిపోతుందేమో నని తలూపాను.

"నిజానికి నా తప్పేమన్నా వుందా?" అందామె, మళ్ళీ.

సాయింత్రం తప్పించుకున్న గోతిలోనే మళ్ళీ పడే ట్టున్నాను. ఏమైనా ఎదురుగుండా వున్నది కాంతమ్మ కనుక, ఆమెను సంతోషపెట్టాల్సిన బాధ్యత నాకువుంది.

"నీ తప్పేంలేదు—" అన్నాను.

నిజానికి ఎవరితప్పో నేను చెప్పలేను. కాని, కాంతమ్మ అంటే నాకు అభిమానం వున్నమాట నిజం. బహుశా ఆమె అతిథి సత్కారం, ఇక్కడొక లంచమై, నాలో పక్షపాతాన్ని ప్రవేశపెట్టి వుంటుందనుకుంటాను.

భోజనం పూర్తిచేసి, మెల్లిగా బైటపడ్డాను.

## 2

రెండు సంవత్సరాలయ్యాక, ఆ పక్క గ్రామంలో బంధువుల పెళ్లికి వెళ్లినప్పుడు, మళ్లీ కాంతమ్మ దర్శనమైంది. ఇంటికి తిరిగిపొయ్యే నన్ను బలవంతపరచి, వాళ్ళవూరు అంతదగ్గరైనా, ఒక్కరోజన్నా వాళ్ళింట్లో ఉండకుండా పోతూన్నందుకు, ఆమె తప్పుపట్టింది. పోనీలెమ్మని వెళ్లాను.

ఆమె అత్తగారు సంవత్సరం క్రితమే యీలోకాన్ని వీడింది. నేను అనుకున్నాను— కాంతమ్మ కాపరంలో మరి అశాంతి లేదని !

చీకటి పడ్డది. వంటఇంట్లో కాంతమ్మ గొంతు పెద్దగా వినిపిస్తోంది. విషయం అర్థంగాక, ఏమిటో చూద్దామనే కుతూహలంకొద్దీ వెళ్ళాను.

మామగారు జపం చేసుకుంటున్నారు. "పోనీ నేను పెట్టుకుంటాలే ?" అంటున్నాడు ఆయన.

"మీ జపమూ, భోజనమూ అయ్యేప్పటికి తెల్లారుతుంది. ఇంట్లోవాళ్ళం ఇంకెప్పుడు భోంచేసేట్టూ ? అవతల చంటిపిల్లాడు లేచాడంటే —?"

విషయం అర్థమైంది. మామగారి జపంమీద విమర్శ జరుగుతోంది.

మామగారు నన్నుచూసి, "అదికాదురా అబ్బాయీ! ఇంతకుముందే కదా కూర్చుంది ?" అన్నాడు.

కాంతమ్మ వెంటనేఅందుకొని, "సాయింత్రం విస్తళ్లు కుట్టుకుంటూ కూర్చోకపోతే, జపం పూర్తి చేసుకోరాదూ? పోనీ భోంచేసి, జపానికి ఎంతసేపు కూర్చున్నా ఇతరులకు ఇబ్బంది ఉండదుగా!" అంది.

మామగారు జవాబు చెప్పలేక కాబోలు - జపంలో నిమగ్నుడయ్యాడు. కాంతమ్మ వెనుకనుంచి, చాటుగాఆయన మీద మెటికలు విరిచింది.

రాత్రి భోజనా లయ్యాక, కాంతమ్మ మామగారి గొడవ చెప్ప నారంభించింది; "ఈ ముసలాడితో మహా చావుగా వుంది. ఎంతకూ జపంలోంచి తెమలడాయె! మడీ, ఆచారమూ, పాడూ-పచ్చిబద్దలూను!"

"మీ అత్తగారికన్న మామగారే మంచి వాడని చెప్పేదానివి?" అన్నాను.

"పాపం—ఆమెదేముందీ? మోటుమనిషికనుక, కాస్త కటువుగా మాట్లాడేది; చచ్చి ఏ స్వర్గాన వుందోకాని, నేను ఆమెకు చేసిందానికన్న, ఆమె నాకు చేసింది ఎక్కువ. ఆమె బతికున్నన్నాళ్ళూ యీ ముసలాడు ఆమెను మాత్రం కాల్చుకుతినలా?"

వాళ్ళిద్దర్లో ఎవరు మంచివాళ్ళయినా నాకు అనవసరం. ఈ సందర్భంలో కాంతమ్మ మాటలుమాత్రం అథారిటీగా తీసుకోవాల్సిందే!

"చిన్నపిల్లాడు ఉన్నాడనే జ్ఞానమన్నా లేదుకదా ఆయనకు ?" అందామె.

"ఏదో ముసలాడు లే!"

"ముసలాళ్ళకే మతివుండదు. చేసేదాన్ని వున్నానుకదా నని ఇలా ఏడిపించుకు తింటూంటే...."

నేను నిద్రనటించాను. నేను "ఊఁ" కొట్టటంఆపేప్పటికి, మిగతా మాటల్ని ఆమె వినపడీ వినపడకుండా అనేసింది.

# 3

నాలుగు సంవత్సరాలు గడిచాక, మళ్ళీ ఏదో సందర్భంలో కాంతమ్మగారి వూరు వెళ్ళాను. ఇప్పటికి కాంతమ్మ మామగారు కూడా పరలోకగతు లయ్యారు.

మధ్యాహ్నం భోజనానికి పిలుపు వొచ్చింది.

"బావనుకూడా రానీ!" అన్నాను.

"ఆయన యీపూట రారేమో-వొచ్చినా ఆలస్య మవుతుంది—నువ్వు లే-అన్నయ్యా!" అంది.

నేను వివరాలు తెలుసుకోకుండానే భోంచేశాను. సాయంత్రంవరకూ ఆమె భర్త రానేలేదు. తీరుబడిగా కాంతమ్మ కబుర్లుచెప్పటం మొదలు పెట్టింది.

"రోజూ ఇంతే — ఒక్కోనాడు మనస్సు తిరుగుతే ఇంటికి వొస్తారు—లేకపోతే లేదు". అంది కాంతమ్మ.

"రాక ఏమౌతాడూ ?"

"ఛీట్లపేకో—పాడో! ఉన్న ఆస్థి అంతా ఇలా తగలేస్తున్నారు. వెనక ముగ్గురు పిల్లలున్నారనే జ్ఞానమన్నా లేదు. చచ్చి ఏస్వర్గాన వున్నారోగాని—అత్తగారూ, మామగారూ బతికివున్నట్టయితే ఇలాటిపనులు జరగనిచ్చే వారుకాదు. వాళ్ళ ముసలితనంలో వాళ్ళను సరిగ్గా చూశాడూ? ఇంటికి వొస్తూనే ధుమధుమలాడుతాడు. చెప్పొద్దూ-నాకు అరికాలి మంట నెత్తికెక్కుతుంది. నన్ను అనవసరంగా రెచ్చగొడతారు. నేనేదన్నా అంటే—చిటచిటలాడుతూ పోయి—

మళ్ళీ ఏ రెండు రోజులకో ఇంటికి వొస్తారు. రాత్రి ఇలాగే ఐంది.... ఆపాట ఆ వానలో తడుస్తూ పోయ్యారు—"

కాంతమ్మ రకం వ్యక్తిలో ఏలోటువుందో నాకిప్పుడు బాగా అర్థమైంది. ఆవిషయాన్ని ఆమెకు బోధపరుస్తే ఆమె సౌఖ్యపడే అవకాశం వుంటుంది.

అన్నాను: "అదేమిటీ—అల్లా మాట్లాడతావ్? నేను మొదటిసారి వొచ్చినప్పుడు. అత్తగారితో పోట్లాడి, ఆమెను రాక్షసి అన్నావ్. రెండోసారి వొచ్చినప్పుడు, మామగారితో పోట్లాడి, ఆయన్నూ ఆయన జపాన్నీ తిడుతూ, అత్తగార్ని మెచ్చుకున్నావ్, ఇప్పుడు అత్తగార్నీ, మామగార్నీకూడా మెచ్చుకుంటూ...."

"నిజంగా వాళ్ళు మంచివాళ్ళేగా!"

"మరి మంచివాళ్ళతో ఎందుకు పోట్లాట వొస్తుందీ?"

ఈ ప్రశ్నకు ఆమెకు జవాబు దొరకలేదు. ఆమెలోని తప్పును ఎత్తిచూపుతూన్నందుకు, ఆమె ముఖం కాస్త ఎర్ర బడ్డది.

"—అలాగే నీ భర్తవిషయంలోకూడా, అనవసరపు తగాదా పెట్టుకొని ఉంటావ్!" అన్నాను.

"నేను పోట్లాడానా?" అందామె.

"నువ్వుకాక, ఇంకెవరు పోట్లాడారూ?"

అభిమానం ఎక్కువగా నే పనిచేస్తూండటంవల్ల ఆమె కనుబొమలు ముడిపడ్డయ్

"నీలాటివాళ్లు అలాగే అర్థంచేసుకుంటారు. ఎలాటి మనుషులకు అలాటి దృక్పథమే వుంటుంది—"

"అదేమిటీ?" అన్నాను, అర్థంగాక.

"ఏముందీ—నువ్వుమాత్రం తక్కువ వాడివా? ముప్పై నాలుగేళ్లు వొచ్చినా, పెళ్ళీ పెటాకులూ లేదు. బి. ఎ. దాకా చదివి, ఉద్యోగం సంపాయించలేక నాటకాల్లో వేషాలు వేస్తూ—!"

నా వ్యక్తిగత జీవితంమీది చర్చ నాకు చాలా కష్టంగా తోచింది వాదనకు అవకాశం లేక, కాంతమ్మ నామీద అనవసరంగా పడ్డది. ఇక ఆమె నోటికి అడ్డుండదు. అందుకని, ఒక్కక్షణంకూడా నేనక్కడ ఉండదలచుకోలేదు. కాంతమ్మ ముఖం చూస్తే, నాతో పోట్లాటకు నిరీక్షిస్తున్నట్టు తోచింది. అలాటిది నాకు మనస్కరించక, చెప్పకుండానే, ఆ సందె చీకట్లో పొలాలకు అడ్డంపడి నడవసాగాను.

— ఆగష్టు, 1946



# జూదరి

మూడు రోజుల్నుంచీ శంకరం ముఖంలో అర్థంకాని ఆవేదన ఏదో స్పష్టంగా కనిపిస్తూ వుంది. డ్యూటీలోనూ, శుశ్రూషలోనూ, ప్రవర్తనలోనూ శ్రద్ధయేమీ కనిపించటం లేదు. సంభాషణలో చాలా అన్యమనస్కంగా ఉంటున్నాడు; అసలు క్లబ్బులోకివొచ్చి ఎవర్నీ పలకరించకుండానే, ఒక మూలజేరి ఒంటరిగా కూర్చొని తనకు అందని విషయాన్ని గూర్చిన ఆలోచనతో బాధపడుతున్నట్టు తోస్తుంది. చీట్లపేక అంటే చెవికోసుకొనే శంకరంలో యీమార్పురావటం నాకు నిజంగా ఆశ్చర్యం కలిగించింది. నాలుగైదుసార్లు హెచ్చరించి చూశాను కాని, "ఏంలేదు బ్రదర్!" అని దాసుకు పొయ్యేందుకు ప్రయత్నించాడు.

ఒకటికి రెండురోజులు గడిచినా వాడిస్థితి మారలేదు. సంగతేమిటో తెలుసుకోవాలనే కుతూహలమూ, స్నేహితుడు ఏదో గొప్పసమస్యతో వేగిపోతున్నాడనే బాధా, ఆబాధకు ఏదైనా దారిదొరుకుతుందేమో చూద్దామనే అభిలాషా నాలోనానాటికీ పెరగజొచ్చినయ్ అందులోనూ నేనంటే పడి చచ్చే మిత్రుడియోగక్షేమాల్ని విచారించాల్సిన నాబాధ్యత నన్ను మరీతొందర పెట్టసాగింది.

"ఎంతచెడ్డా స్నేహితుణ్ణి, నీహృదయంలోది ఎంత గొప్ప వ్యక్తిగత జీవితరహస్యమైనా నీలోనువ్వు ఇలా కుమిలి పోవటంవల్ల లాభంలేదు. ఇతరులకు చెప్పుకోవటంవల్ల కొంత

హృదయభారం తగ్గుతుంది. నీబుద్ధికి అందని దారికూడాదొరక వచ్చు-" అన్నాను. యీ ముసుగులో గుద్దులాట వ్యవహారంతో తలవాచి.

ఆ చీకట్లోకి లాక్కుపోయి కూర్చోబెట్టి "నీతో చెప్పాలనే వుందికాని, ఒకవిధంగా మనస్కరించటంలేదు" అన్నాడు.

"ఎందుకనీ ? నన్ను నమ్మలేవా?"

"అది కాదు. విషయాన్ని-నాహృదయారాటాన్ని-నీకు బాగా అర్థమయేట్లు చెప్పగలనాఅని నాఅనుమానం. చెప్పాక నువ్వు ఎగతాళిగా నవ్వుతావేమోననే భయమూను!"

"స్నేహితుడు కష్టదశలో ఉండగాచూసి నవ్వేవాడు స్నేహితుడు మాత్రం కాదు.... రాక్షసుడు!"

క్షణంసేపు నాముఖంలోకిచూసి "నిజమే ననుకో! ఇతరులకు బాధకలిగించకుండా, రెండో సహాయంలేకుండా యీసమస్యను నా అంత నేనుగానే తీర్చుకుందామనుకున్నా కాని, సాధ్యపడలేదు, ఇది ఇంకో సహాయంకోసం అర్థించాల్సిన సమయమని కూడా తోస్తోంది."

"డబ్బువిషయం కాదుకదా ?"

"కాదులే ?....ఐనా సంభాషణ మొదలు పెట్టగానే ప్రతివాడూ నీపర్సుమీదనే కన్నుంచి మాట్లాడుతూన్న అనుమానం నీకు ఎందుకు కలుగుతుందో అర్థమవటంలేదు.... ఎప్పుడూ ఇంతే !" అని ముఖం ముడుచుకున్నాడు.

"లేదు లేరా బాబూ ! యీ రోజుల్లో ఆర్థికసమస్య అంటే కాస్త భయంగా ఉండి అలాఅన్నాను. అసలు సమస్యలో లేని కొత్త బాధ యీ ఉపసమస్యలో రావటం హాస్యాస్పదం !....

సంగతి తేల్చు-నీకు పుణ్యంవుంటుంది ?" అని ఒక విధంగా ప్రార్థనాపూర్వక స్వరంలోనే అన్నాను.

పుణ్యంగొడవ వాడికి పట్టదని నాకు తెలుసు. ఐనా వెంటనే ప్రసన్నుడయ్యాడు.

"తేల్చేందుకు ఏముందిలే.... నాభార్య విషయం—" అని ఆగాడు.

కథ చాలా గొప్ప సస్పెన్సులో నిలిచిపోయింది. ఏవిషయం మీదనైనాసరే చప్పున ఏదో వొకటి వాగెయ్యొచ్చు లేదా ఏదో ఒకవిధంగా ఆలోచించవొచ్చు-కానీ "స్నేహితుడిభార్య" విషయంలోమాత్రం పెదవి కదిల్చే హక్కూ అధికారమూ లేకపోను, విరోధానికి దగ్గరిగా జేర కుండా చూసుకోవాల్సిన బాధ్యతకూడావుంది. అందుకని, వాడు నోరు విప్పేదాకా తప్పని సరిగా ఊపిరి బిగపట్టుకొని కూర్చోవాల్సి వొచ్చింది.

నా నిశ్శబ్దతలోని సిన్సిరిటీని గ్రహించిన వాడల్లే వెంటనే మాట్లాడటం మొదలుపెట్టి నాకూ (తరువాత మీకూ-డా !) చాలాశ్రమనూ, ఆందోళననూ తప్పించి నందుకు మనసులో వాడికి అనేక ధన్యవాదాలు (మీతరఫునకూడా) అర్పించుకున్నాను.

"నాలుగు నెలల క్రితం నా ఉద్యోగం పోయిందని మీ అందరికీ తెలుసుగా!.... ఆసంగతి నాభార్యకుమాత్రం తెలియదు!"

"ఈ శుభవార్తను ఆమెకు ఎలా అందజెయ్యాలా అని చూస్తున్నావాయేం? కావాలంటే నేనే స్వయంగా వొచ్చి చెప్తాను."

"గొప్పపని చేస్తావ్! పోయింది నా ఉద్యోగం కనుక ఆవార్తను మోసెయ్యటం నీకు బహుతేలిక!"

"ఉద్యోగం పోయినందుకు ఇంత బాధ పడుతున్నావనుకోలేదు."

"నాకేం బాధ లేదు. బాధపడటంవల్ల ప్రయోజనమూ లేదు. ఇంకో ఉద్యోగం వొచ్చేసూచనలు స్పష్టంగా కనిపిస్తున్నాయ్. అది రాగానే కాస్తోకూస్తో మిగిలివున్న యీబాధను పూర్తిగా వొదిలించుకోవొచ్చు."

"ఇప్పుడిక సమస్య ఏముందీ?"

"ఈ నాలుగు నెలలూ ఎలాగడిచినయ్యనీ? మానాన్న నన్ను సోమరిగా ఉంచకుండా ఉండేందుకూ, ఇండియాప్రభుత్వం పన్నులనే మిషమీద నాజేబు తవడకుండా ఉండేందుకూ బాగా ఆలోచించి, సెంటుభూమీ దమ్మిడీ క్యాషు కూడా మిగల్చకుండానే పోయారు.... సరే.... మొదటినెలంతా క్లబ్బులో చీట్లపేకసెక్షన్ పోషించింది. కాని రెండో నెల నుంచీ రాబట్టుకున్న దానికన్న రెట్టింపుపిండే ప్రయత్నానికి

పునాదివేసిందని తెలియలేదు. అసలు ఉద్యోగం పోనే పోయింది. ఇక యీ ఉద్యోగానికన్నా దిగుదామనే మూఢ నమ్మకంకూడా నాలో బాగాపనిచేసింది....కొంత పెట్టుబడి కావల్సివొచ్చింది. భార్యను ఏడిపించి మెల్లిగా ఆమె మెడ లోని బంగారుగొలుసు తీసుకొన్నాను. ఆగొలుసు—నాలుగు పేటలది. ఆమె పుట్టింటివారు ఇచ్చింది. ఆమెమెడలో మెరు స్తూవుండేది. దాన్ని ఏవిధంగానూ దుర్వినియోగం చెయ్య కూడదనే నిశ్చయం లోపలవుందికాని, అంతకన్న గత్యం తరం లేకపోయింది.. అదీకాక, నేను ఆ డబ్బుతో వ్యాపారం సాగించిఒకటికి రెండుగొలుసులు చేయిద్దామనికూడా ఆశ పడ్డాను...ఆమె ఇచ్చేప్పుడు గంపెడు అనుమానంతో పెద్ద పోట్లాటజరిగాక కాని ఇవ్వలేదు. నాఉద్యోగం పొయ్యే పరి స్థితిఏర్పడ్డదనీ (నిజానికి ఉద్యోగంపోయింది; కొత్త ఉద్యో గాన్ని మొదలుపెట్టేందుకే యీఅవస్థ!) మళ్ళీ రెండువారాల్లో గొలుసుతెచ్చి ఇచ్చేస్తాననీ, ప్రమాణాలు చేసిఎలాగో ఆమెను కరిగించి తీసుకొచ్చాను. ఆగొలుసును తాకట్టుపెట్టి ఆడబ్బును మనక్లబ్బులోని చీట్లపేక ఆఫీసుసభ్యులకు పంచిపెట్టేశాను. అనుకున్న దానికన్న త్వరలోనే, చకచకా పనులు ఐపోవటం వల్ల, వెంటనే యీ ఉద్యోగంలోంచి బైటపడ్డాను—”

“ఇదువరకల్యాణమే!” అని పూర్తిచేశాను.

“కనుకనే ఇన్నాళ్ళా మళ్ళీ దానిజోలి ఎత్తకుండా ఉండగలిగాను!”

"ఇప్పుడు మళ్ళ కొత్తప్రవేశానికి ప్రయత్ని స్తున్నావా ?"

"ఇంకానా ? బాగాబుద్ధొచ్చింది ! జీవితంలో ఇక ముందు యీ పాడుజూదం ఆడకూడదని పెద్ద ఒట్టుపెట్టు కున్నాను."

"ఇంకేముందీ—నిర్విచారంగా నిద్రపో !"

"పేకాట గొడవ నాకేం పట్టిందీ—అసలు సమస్య నా భార్యతో—"

"అన్నట్టు మరిచిపోయ్యాను.... చెప్పు"

"నిర్ణీత కాలానికి గొలుసు ఎప్పుడైతే రాలేదో ఆమె అనుమానం హెచ్చయింది. రోజులు గడిచినకొద్దీ ఆమె ఓర్పు కూడా తగ్గటం మొదలుపెట్టింది. మొదట్లో 'ఇదుగో—అదుగో' అని వాయిదాలువేస్తూ ఎలాగో సర్దిచెప్పేవాణ్ణి. కాని నా మాటలన్నీ నీళ్ళలోని మూటలని గ్రహించేందుకు ఆమెకు ఎక్కువ కాలం పట్టలేదు. ఇక లాభంలేదని ఆమె పోట్లాడటం మొదలుపెట్టింది: రోజూ ఇంటికిపోగానే గొలుసు సంగతి ఎత్తి ఘోరంగా పోట్లాడేది. నేనుకూడా లేని కోపాన్ని నటిస్తూ, గంభీరంగా దబాయించే వాణ్ణి. తనచేతకాని తనాన్ని పెద్దగా ఏడుస్తూ బైటపెట్టటం నాకు భరించ శక్యం కాకుండా పోయింది ఈ పరిస్థితిలో ఉద్యోగంకూడా ఊడిం దనే విషయాన్ని చెప్తే నాస్థితి మరీ ప్రమాదంలో పడు తుంది; ఉద్యోగంలేని భర్తనుచూస్తే ఏభార్యగౌరవిస్తుందీ?"

"ఆ గొలుసు నేను తెచ్చిఇవ్వలేను. నన్నెందుకు చంపుతావు—అని ఖచ్చితంగా చెప్పేసెయ్"

"ఆమె వినేస్థితిలో లేదు. నేను తెచ్చిఇవ్వగలననీ, కాని టలాయిస్తున్నాననీ, ఎలాగైనా ఆశవదలకుండా పట్టుబడితే నే కాని నేను తేననీ ఆమె అపోహపడుతోంది. నా అసమర్థతను మాత్రం నమ్మేందుకు నిరాకరిస్తుంది...."

"ఇలాగే మరికొన్నిరోజులు సాగితే యీ ఉన్న ఆశ అడుగంటుతుంది; అప్పుడిక నమ్మిక తప్పేదికూడా ఉండదు"

"అంతా వినకుండానే సలహాలివ్వవోక. ఐదారు రోజుల్నుంచీ ఆమె నిమోనియాతో మంచ మెక్కింది. డాక్టర్ శాస్త్రి చికిత్సచేస్తున్నాడు. బతికే ఆశలు జహాంకొద్ది అని చెప్పాడు. అత్తగారూ, మామగారూ, మరదలూ కూడా వొచ్చారు. నిరాశతో వాళ్ళంతా కంటతడిపెడుతూవుంటే, నాక్కూడా బావుర్న ఏడవాలనిపిస్తూవుంటుంది. ఆ ఇల్లోక యమలోకంగావుంది. అందులోనూ ఫిట్సుకూడా ఆరంభమైనవి. పాడువ్యాధి ఆమెను బతకనివ్వటమూ లేదు, చావనివ్వటమూ లేదు. యీ వ్యాధితో బాధపడుతూకూడా నేను ఇంట్లోకాలుపెట్టటం తడవుగా 'ఏమండీ! గొలుసు తెచ్చారా?' అని మొదలుపెడుతుంది. అంతవరకూ శ్వాస ఆడక బాధపడుతూ, బలహీనతతో మాట్లాడేశక్తి లేకుండా పడివుండి, నేనుపోగానే ఎగిరిమీదికి దూకుతూన్నట్లు ఇంటికప్పు ఎగిరిపొయ్యేకంఠధ్వనితో అలానిలవదీసి అడుగుతూంటేనిలువునా నీర్సై పోతున్నాను. ఆగొలుసు నిజచరిత్ర మిగతావాళ్ళకుసరిగ్గా

తెలియకపోయినా, అదేదో అతివిచిత్ర సంఘటన ఐనట్లూ, ఆ తప్పంతా నాదేనన్నట్లూ, అసలు ఆమెను యీ స్థితికి లాగింది ఆ గొలుసేనన్నట్లూ—నా వైపు అనుమానంగా, ఒక కూనీ కోరును చూసే ఏవగింపు చూపులతో చూస్తున్నారు. ఇంట్లో ఉన్నంతసేపూ గొలుసు బాధ: యీ బాధ పడలేక అందరూ వెళ్ళేదాకా క్లబ్బులోనే కూర్చుంటున్నాను. కాని మరణావస్థలోవున్న భార్యను ఎలా మరిచిపొయ్యేదీ? దగ్గర్లోనే ఉండి భార్య మృతశయ్యదగ్గర లేకపోతే రేపు లోకులు నా దురాత్మ్యాన్ని బుర్రకథలుగా చెప్పుకుంటారనే భయం కూడావుంది. పోనీ యీలోపుగా దాని ప్రాణి పోయిందేమో సగం బెడద వొదులుతుందని—ఏ అర్థరాత్రో ఇంటికి వెళ్తే—అంతకు క్రితం కిందదించిన ఆమె బొందిలోకి—నిజంగానేపోయిన ప్రాణి తుఫానులాగా వొచ్చిపడుతుంది. వెంటనే గొలుసు విషయం మొదలు. నేను ఆమెను ప్రేమించి పూజిస్తూ గౌరవించిన సంఘటనలుకానీ, ఆమెకు చేసిన ఉపకారాలుకానీ ఏవీ జ్ఞాపకంలేవు; నేను చేసిన ఒక్క అపకారమూ-వెధవగొలుసును తీసుకువెళ్ళిన సంఘటన వొక్కటే ఆమెకు అంత్యక్షణాల్లోకూడా బాగా జ్ఞాపకంవుందంటే నిజంగా ఆశ్చర్యంగానేవుంది!....మరీ రెండు రోజుల్నుంచీ ఆమె కంఠధ్వనిలో బాగా మార్పువొచ్చింది. ఆరోగ్యం బాగా క్షీణించటం వల్లనేనేమో? పాలిపోయిన ముఖంలోనుంచి కాంతిహీనమైన కళ్ళు తెరచి, దీనంగా, జాలిగా బాధగా నావైపు చూస్తూ 'గొలుసు తెచ్చారా?' అని అడుగుతుంది. పూర్వంలాగు దబాయించి అడిగినప్పటికన్న,

ఇలా అర్థించే కంఠధ్వని నన్ను మరీ బాధపెట్టసాగింది. మరదలు పిల్లకూడా ఇక ఆగలేక 'బావా! ఏం గొలుసూ?' అని మొదలుపెట్టింది. ఏంజవాబు చెప్పేదీ?... ఆమెమాత్రం ఆ గొలుసు చూడందే ప్రాణం విడవదన్న నమ్మకం నాకు దృఢంగా ఏర్పడ్డది. ఒకవేళ గొలుసు చూడకుండానే ప్రాణం పోతేమాత్రం-దయ్యమై ఆ గొలుసు కోసం నాప్రాణం తియ్యక మానదు! గొలుసు చూసేవరకూ దాని ప్రాణి అలా కొట్టుకులాడుతూవుంటే ఏం చెయ్యాలోతోచక చస్తున్నాను—"

శంకరం చెప్పిందంతా కళ్ళముందు కట్టినట్టుగావుంది. క్షీణదశలోవున్నరోగి ఆకృతీ, ఆమంచంచుట్టూ జేరిన ఆత్మ బంధువుల నిరాశావిలాపాలూ, ఆరాటమూ, ఆవేదనా—ప్రాణం ఆమె గొంతుకలో కొట్టుకులాడటమూ-వీడు మెల్లిగా దొంగతనంగా వంటింట్లో ప్రవేశించే పిల్లిలాగు ఇంట్లోకి వెళ్ళటమూ-ఆమె ఆశమళ్ళీ రేగి హీనదీనంగా గొలుసు అడగటమూ, వీడు నీరైపోవటమూ-వీడి అవస్థ తేలిగ్గా గ్రహించుకున్నాను. ఏంసలహా ఇచ్చేట్టూ?

"ఒక్కసారి ఆగొలుసును ఆమెకు చూపుతేచాలు. హాయిగా ప్రాణంవొదులుతుంది. చావబోయ్యేముందుకూడా యీ వింతకోర్కె-యేమిటో నాకు అర్థంకావటంలేదు—" కన్నీరు ఒక్కటే తడవుగా పాలిపోయిన వాడిముఖకళను నేను భరించలేకపోయ్యాను. అందులోనూ మరణావస్థలోవున్న భార్య స్వల్పకోరికను తీర్చలేని అసమర్థుడి అవస్థ!

"ఒక్కసారి ఆగొలుసు తీసుకువెళ్ళు—"

"ఎట్లా? మూడువందలరూపాయిలకు తాకట్టులోవుంది. అది విడిపించి తీసుకువెళ్ళి ఆమెకు చూపుతే - ఆతరువాత ఒకటి రెండురోజుల్లో గొలుసు అమ్మెయ్యవొచ్చు."

శంకరానికి సహాయంచేసి తీరాలనే నాఆత్మబోధ వృధాపోలేదు. ఆరునెలల స్నేహమే అయినా, నెలతిరక్కుండానే అది 'అరేయ్' 'ఒరేయ్' మెట్టుదగ్గరకు వొచ్చింది. ఇంతత్వరగా అభివృద్ధిచెందిన స్నేహాన్ని రుచిమరిగాక, వొదలటం బహుకష్టం. అందులోనూ నేనంటే ఎంతో అభిమానంగా ఉంటాడు! వాడికి ఆస్తియేమీ లేదని వాడే చెప్పన్నాడు; ఐతేమాత్రమేం? మాక్లబ్బుస్నేహాన్ని క్లబ్బుస్నేహంగానే కాకుండా వేరొకరూపంలో దాన్ని బంధించాల్సిన అవసరం ఎప్పటికైనాతప్పదు. ఇప్పుడు వాడిదీనస్థితి నాజాలిగుండెను కరిగించింది; యీ సమయంలోనే స్నేహం విలువను రూపించుకోవటం మంచిది అదీకాక పైకాన్ని రెండు రోజులపాటు అప్పంగా పెడితేచాలు——రెండుప్రాణుల సమస్యను తీర్చినట్లే! మొదటిప్రాణి యీజీవితపు ఆవలిగట్టు ప్రయాణాన్ని వెంటనే సాగిస్తుంది; రెండోప్రాణి కల్మపాత్ర పెట్టే బాధనుంచి దూసుకుంటుంది. శంకరం ఎవరైతేనేం? తోటిమానవుడు; స్నేహితుడు, వాడు నానుంచి సానుభూతిని కోరేందుకు యీ రెండుకారణాలేచాలు.

"ఆపైకం నేను ఇస్తాను, కాని నువ్వు రెండురోజుల్లో సర్దెయ్యాలి. ఎందుకంటే—— అది ఇతరులెవరో నాదగ్గర దాచుకున్నారు; ఏక్షణాన్నయినా-దాన్నితిరిగి ఇచ్చెయ్యాల్సిన బాధ్యత నాకువుంది.... తెలిసిందా?" అన్నాను.

వాడుకృతజ్ఞతా పూర్వకంగా నాకళ్ళల్లోకిచూసి అన్నాడు; "ఇంత క్లిష్టపరిస్థితిలో సహాయ పడ్డవాణ్ణి స్నేహితుడుగా చూసుకోలేను — దైవంగానే చూసుకుంటాను. గోలుసుచూడగానే ఆమె హాయిగా ప్రాణంవిడుస్తుంది.... వెంటనే గోలుసుఅమ్మి నీపైకం తెచ్చిఇస్తాను.... నీ మేలును మాత్రం యీజన్మకు మరువను...."

వాడికి పైకంఇచ్చి ఓదార్పుమాటలతో ధైర్యంచెప్పి సాగనంపాను.

## 2

నాలుగురోజులు గడిచినా, శంకరం అంతులేదు. పాపం-వాడిభార్యకు ఎలావుందో? గోలుసుచూసింది మొదలూ ఆరోగ్యాన్ని పుంజుకుంటూవుందేమో! ఇదే నిజమైతే, రెండోసారి ఆమె శంకరానికి గోలుసుఇవ్వదు, శంకరం అప్పుగాతీసుకున్నపైకం మళ్ళీ తిరిగిరానూరాదు .... .... వెధవ డబ్బు పోతేమాత్రమేంలే-వాడు రెండోపెళ్ళికోసం శ్రమ పడకుండావుంటేఅదేచాలు! లేక గోలుసు వేసుకొనే ప్రాణాన్ని వొదిలిందేమో? ... ఊహించి లాభం లేదు. పరిస్థితిఏమిటో తెలుసుకోవాలనే కుతూహలం పెరగజొచ్చింది. వాడిఇల్లు ఎక్కడోకూడా నాకు తెలియదు.

డాక్టర్ శాస్త్రి చికిత్సచేస్తున్నాడని వాడన్నమాట చప్పున గుర్తొచ్చింది. సాయంత్రం డాక్టర్ కనిపించగానే అవతలికి పిలిచి "శంకరంభార్యకు ఎలావుంది?" అనిఅడిగాడు.

"ఏశంకరం?" అన్నాడు శాస్త్రి.

మనశంకరమే! చిత్తూరునుంచి ట్రాన్సఫరై కలక్టరాఫీసుకుగుమాస్తాగా వొచ్చాడే.... ఆరునెల్ల క్రింద ఉద్యోగం ఊడిందే?....ఆచీట్లపేక సెక్షన్‌లో గంటలతరబడి కూర్చుంటాడే....జ్ఞాపకంరాలా ?"

"చిత్తూరు శంకరమా! వాడిపెళ్ళానికా ? ఏం ?"

"నిమోనియాటగా ! నువ్వు చికిత్సచేస్తున్నావటగా?"

శాస్త్రి పెద్దగానవ్వి "వాడిపెళ్ళానికి ఏ రోగమూ వొచ్చేందుకు వీల్లేదు !" అన్నాడు.

"ఆమె మానవమాత్రురాలుకాదనా ?" అన్నాను.

"అదికాదు....వాడి కసలు పెళ్ళామేలేదు : ఇంత వరకూపుట్టి పీడికోసం సిద్ధంగా వుందోలేదో కూడా అనుమానమే : ఒక వేళ నువ్వన్న నిమోనియా వాడిపెళ్ళానికై ఉండదు. వాడికేఐఉండాలి :"

నాగుండె కొట్టుకోవటం ఆగిందేమోననిపించింది. యీవెధవ ఎంతపెద్ద అబద్ధమాడాడు ! డబ్బుకోసం పెళ్ళి చేసుకున్నాడు: డబ్బుకోసం భార్యగొలుసు తీసుకున్నాడు; దాన్ని జూదంలోఓడాడు; గొలుసుపొయ్యాక భార్య దేని కనుకొని, ఆమెకు నిమోనియా తెప్పించాడు; చివరకు ఆమెను చంపేందుకు నాదగ్గర మూడొందలు భరణంగాకూడా తీసుకున్నాడు : ఏమైనా, ఆరోగిష్టి మంచమూ, చుట్టూ జేరిన రోగి ఆత్మబంధువుల ఆవేదనా, చిన్నపాముపిల్లలాటి గొలుసు

ఆమెకళ్ళముందు ఆడితేనే కాని పోనని పట్టుబట్టిన ఆమె మొండిప్రాణి ఆరాటమూ - ఇవన్నీ నాకళ్ళముందునుంచి ఇంకాపోలేదు. శంకరం యీవిషయాల్ని నామీద ఎంత గొప్పగా, బాగా రుద్దగలిగాడంటే డాక్టర్ మాటల్ని అనుమానించటమేకాక, ఒక వేళ అవి నిజమైనా కనీసం ఒక సంవత్సరం పాటైనా ఆ దృశ్యాన్ని మరిచిపోలేను !

ఎదుటవున్న డాక్టర్ మాటలతో నా ముఖం వెలవెలబోయింది; దృష్టిపథంలో లేని ఆ శంకరంగాడి మీద కోపంతో ముఖమంతా ఎర్రబడేందుకు సిద్ధంగావుంది. విరుద్ధజాతికి చెందిన రెండు ఫీలింగ్స్ ఒకదాని వెంట కేవేరొకటి రావటంవల్ల ఆ ఘాటికి చప్పున తట్టుకోలేక పోయ్యాను. ఎందుకోగాని గట్టిగా నేలమీద తన్నాను.

ఆ ఫీలింగ్స్ తనవి కాకపోయినా, ఆ తన్నిన తన్ను తననేనన్నట్టు శాస్త్రి ఎగిరిపడి "ఏం-ఏమైంది?" అని ఒక కొత్త కేసు దొరికినట్టు నా నాడిని పరీక్షించేందుకు చెయ్యిజాపాడు. నేను చప్పున చేతిని వెనక్కు లాక్కొని "రోగ్! మోసగాడు!" అన్నాను; అన్నాక, ఎందుకు తొందరబడ్డానా అనిపించింది.

"ఎవరూ ?" తననే అనుకున్నట్టున్నాడు !

"శంకరంగాడు !"

"ఏం....ఏం చేశాడూ? గొలుసుకథ కాని నీకు చెప్పాడా యేం?"

ఐతే యీగొలుసుకథ వినేందుకు నేను మొదటివాణ్ని కాదన్నమాట! నాలాగే మరికొంత మంది ఇదివరకు మోసపోయే ఉన్నారన్నమాట! నాకుతోడుగా నాతోపాటే కంఠంకలిపి ఏడ్చేందుకు మరికొందరు ఉన్నారన్నది ఒకరకంగా ఓదార్పుగా కూడావుంది.

శంకరంగాడు నాకుచెప్పిన కథంతా డాక్టర్‌కు చెప్పాను. శాస్త్రికి సస్పెన్సు యేమీ తోచలేదు.... నాకన్న ముందుగానే యీకథను వినిఉన్నాడాయె! అందులోనూ ఇది మూడోసారట! కథమాత్రం మక్కీకి మక్కీ సరిపోయింది....

“నాకు అర్థంగాక అడుగుతాను....నువ్వు పైకంఎలా ఇచ్చావంట? డాక్టరువై ఉండీకూడా !”

“వాడికథలో ఆ నేర్పువుంది నాకుచెప్పిన కథలో కొద్దిమార్పుకూడా వుంది లే! అందులో వాడింకా వివాహమాడని వాడిభార్య ఇక్కడికి ఇరవై మైళ్ళ దూరంలోవున్న పల్లెటూరిలో గొలుసుకోసం కలవరపడుతూ నిమోనియాతో మృత్యువును ఎదురుచూస్తూవుంది. డాక్టర్ వృత్తిలో తీరికలేక ఛస్తున్న నన్ను రమ్మంటాడేమోననీ, అందులోనూ ఆశలన్నీ వొదులుకున్న రోగికోసం వెళ్ళటం ఎండమావు అని తెలిసి వుండీ కూడా దానికోసం పరుగెత్తటం లాంటిదనీ—ఎలా దూసుకుందామా అని ఆలోచించాను. కాని మహానుభావుడు గొలుసు ఖరీదు మూడువందలూ మాత్రమే వసూలుచేసి

వొదిలినందుకు తరువాత నేను పరమానంద భరి తుణ్నయ్యాను."

"ఐతే యీఒక్క గొలుసూ ఇంతవరకూ ముష్కాటు తాకట్టులోకిపోయి, ముష్కాటు లోకుల చందాల మీద విడిపించబడ్డ దన్నమాట...."

"మళ్ళీ తాకట్టులోకి పోదనే నమ్మకం ఏదీ?"

"ఎన్నిసార్లన్నా పోవచ్చు. మనిద్దరికీ ముందు ఎవరూ?"

"పొట్టి ప్లీడరు—"

"ప్లీడరుకూడా టోపీపడ్డాడూ! అతనికి ఎంతకు వేశాడూ?"

"వాడిలోకూడా ధర్మం ఉన్నదిరా! ఒకడి ఎక్కువా, ఇంకోడి తక్కువా లేదు. గొలుసు ప్రస్తుత షెడ్యూల్ రేటు మీదువందల రూపాయిలు....టాక్సు లేదు!"

"వీడి యీభార్యను నిమోనియాతో బాధపడుతూ బతకనివ్వటం మనసంఘసభ్యుల ప్రాణాల్ని తియ్యటమే! కనుక ఆమెను చంపటం మనవిధి!"

"అంతవరకూ నేను చూడగలను; కాని ఇంకో భార్యను తీసుకొచ్చి ఆమెకు టైఫాయిడ్‌నూ, ఇంకా ఖరీదైన గొలుసునూ తెస్తే?" అన్నాడు శాస్త్రి.

"సరేకాని....యీ సంగతి ఇంతకుముందు నాతో ఎందుకు చెప్పలేదూ?" అన్నాను.

"టోపీపడ్డదికాక, ఏమని చెప్పుకోనూ? ఇప్పుడు ఇద్దరమూ వినాయకుడి బొడ్డులో వేలు పెట్టినవాళ్ళమే కనుక, మనమధ్య రహస్యం లేకుండాపోయిందే—"

డాక్టర్ వ్యాఖ్యానికి నాకు నవ్వు వొచ్చింది.... కాని నవ్వలేదు; ఎందుకంటే ఏలోపానికైతే నేను నవ్వాలో, అదేలోపం నాకు కూడా ఉందాయె; యీగొలుసుకథ వినని వాడెవడన్నా దీన్ని తెలుసుకుంటే, సానుభూతిచూపడుసరికదా— మమ్ము చూసి నవ్వుతాడు కూడాను! అందుకని చచ్చినట్టు దీన్ని జీవిత రహస్యంగానే ఉంచుకోవల్సిన అవసరం ఏర్పడ్డది!

"ఏమైనా వీడు భలే కథకుడు.... ఒక్క తెలుగు కథకు మూడొందల రూపాయలు వసూలు చేశాడు!"

"అందులోనూ తెలుగు కథలంటే ఏవగించుకునే మనదగ్గర!"

"నీ లెక్క ప్రకారం ముగ్గురిదగ్గర-కథను అచ్చుకూడా వెయ్యకుండా నోటిమాటల్తో చెప్పి.... మనకు ఏవిధమైన కష్టమూ కలగకుండా మన మనస్ఫూర్తిగా ఇచ్చేట్టుగా చేశాడు"

"మనకు తెలిసినంతవరకూ ముగ్గురే! మనకు ముందు కానీ, వెనుకకానీ ఇంకా ఉండి ఉంటారు. వాళ్లుకూడా క్రమంగా బైటపడతారు!"

"వీణ్ణి కథకుడు అనటంకన్న మాంచి నటుడు అనటం మంచిది. చెప్పేప్పుడు ఎంతో మంచి సంగీతం వింటూ తన్మయత్వంలో ఉన్నట్టుగా వుంటుంది. ఆ సంగీతానికి మతి

పోయి నాట్యంచేసినట్టయింది!....అసలు కథ వీడి స్వంతమో లేక ఎక్కడన్నా వల్లెవేశాడోకాని .... చెప్పేవిధానం మాత్రం వండర్‌ఫుల్ !"

"ఏమైనా వీడు మొనగాడురా బాబూ !"

# 3

ఆ రాత్రి నిద్ర పట్టే సూచనలేమీ కనిపించలేదు. మోసపుమాటల్తో స్నేహాన్నికూడా లెక్క చెయ్యకుండా, కాల్పనిక సంఘటన (దుర్ఘటన !) సహాయంతో శంకరం గాడు డబ్బు వసూలు చేశాడనే కోపమూ, దీనికి ఏవిధంగా ప్రతీకారం తీసుకోవాలనే ఆలోచనాభారమూ వేధించ సాగినయ్. అదేమొత్తం ఏ జేబుదొంగో, కన్నపుదొంగో పుచ్చుకొని ఉన్నట్టయితే యీ ఆవేదనకు దూరమయ్యేవాణ్ణి!

ఆలోచనలతో తల దిమ్మెక్కిపోయింది. ఇక ఎట్లాగూ లాభం లేదని కృత్రిమ మనశ్శాంతికోసం సినిమాకు బయలు దేరాను. దారిలో డాక్టర్నుకూడా కలుపుకొని అతని కారు లోనే వెళ్ళాను.

సినిమా బుర్రకేమీ ఎక్కేట్టుగా లేదు. ఎంతసేపూ ఆ శంకరంగాడే మనస్సును పిండుతున్నాడు. వీడు నాడబ్బుతో పాటు నా మనశ్శాంతినికూడా తీసుకువెళ్ళాడుకదా!

సినిమా ఐపోయింది. కారులోనే ఇంటికి మళ్ళాం. డాక్టరు డ్రైవ్ చేస్తున్నాడు. వేగంగా వొచ్చే కారు ఒక్క సారిగా ఆగిపోయింది. ఆ కుదుపుకు నా నిద్రమత్తంతా

వొదిలింది; కాస్తయితే ముందున్న అద్దాన్ని నాబుర్ర చీల్చి పారేసేది!

"ఏమిటీ?" అన్నాను....

"ఎవడో రోడ్డుకు అడ్డంగా పడి ఉన్నాడు. కాస్తయితే కారు వాడిమీది నుంచి వెళ్ళిపోయ్యేది"

ఇద్దరమూ దిగివెళ్ళాం. ఆ కారులైట్లలో ఆ వ్యక్తి తప్పతాగి ఒళ్ళు తెలియని స్థితిలోపడివున్నాడని గ్రహించాం. దగ్గరకురాగానే వెంటనే వాణ్ణి శంకరంగా గుర్తించాం. ఇది తెలుసుకునేప్పటికి ఆ వ్యక్తిమీద సానుభూతి సగం తగ్గింది. కాగు వీడిమీదినుంచిపోయినా బాగుండే దనిపించింది.

కాని ఎంత చెడ్డా స్నేహితుడు! అదీకాక రక్తమాంసాల మానవహృదయమంటూ ఉండగా వాణ్ణి ఆ స్థితిలో విడిచివెళ్ళటం అసంభవం! మోసగాడుగా ప్రవర్తించినందుకు వాడిలాచూడబడ్డాడుకాని, లేకుంటే వాడికి — ఏ ఇతర పాంథుడికి, ఏ అపరిచితవ్యక్తికైనా జరిగే సపర్యలు జరిగేవే! ఆ అపరిచిత వ్యక్తికన్న వీడేం తక్కువ తిన్నాడూ? ఒకవేళ మే మిలావొదిలి వెళ్ళినా, మావెనుక వొచ్చేదో, లేక మాకు ఎదురువొచ్చేదో, ఏదో వొక బండి యీ చీకటి రాత్రిని వీడి రక్తం రంగుతో తడపక మానదు.

"ఏం చేద్దాం?" అన్నాను. డాక్టర్ అభిప్రాయాన్ని తెలుసుకుందామని.

"ఇంటికి తీసుకువెళ్దాం...." అన్నాడు డాక్టర్.

దీనావస్థలోవున్న మానవుడు మా ఇద్దరికీ ఒకేరకం

అభిప్రాయాన్ని ఇవ్వగలిగాడు. తప్పని సరైందని ఒకపక్క-నొచ్చుకుంటూనే వాణ్ణి మెల్లిగా డాక్టర్ ఇంటికి జేర్చాం.

మనిషి స్పృహ లేకుండా పడివున్నాడు. బట్టలన్నీ దుమ్ముకొట్టుకొని ఉన్నయ్. అలసి పోయిన ఆ ముఖంలో తనుకూడా ఒకరకం ఆనందాన్ని అనుభవించగలుగుతున్నాననే తృప్తి కనబరిచే వెలుగు....ఉండి ఉండి సన్నగా సంగతి తెలియనివార్తను భయపెట్టేట్టు నవ్వే నవ్వు ద్వారా సూచిస్తున్నాడు. కళ్ళుమూతలుపడి ఉండటంవల్ల వాడి ఫీలింగు రహస్యంగా ఉండి పోయింది.

"అసలు బతుకుతాడా?" అన్నాను. యీ దురాత్మగుణ్ణికూడా ఎలాగైనా బతికించాల్సిన బాధ్యతవున్న మానవత్వాన్ని లోలోన దూషించుకుంటూ.

"ఎందుకు బతకడూ? అరగంటలోనే బాగా తెలివి వొచ్చేస్తుంది"

నేనేమీ మాట్లాడలేదు. డాక్టర్ ఒక్కడూ ఉపచారాలుచేసి ముఖాన చన్నీళ్లు కొట్టాడు. ఇరవై నిమిషాలు గడిచేప్పటికల్లా శంకరం క్రమంగా మన లోకానికి దిగుతున్నాడు. పామును మంటల్లోంచికాపాడి, దానికి ఉపచారాలు చేశాక దానిప్రకృతి ప్రకారం అది పడగవిప్పుతూన్నట్లు - శంకరం కళ్లుతెరిచి మోచేతులమీద లేచేందుకు ప్రయత్నిస్తున్నాడు.

"ఏరా! బాగా తెలివొచ్చిందా?" అన్నాను, యీ క్షణానమాత్రం వాడితప్పుల్ని క్షమించగలిగినట్టుగా తోచింది.

"ఎవరూ! వెంకటేశం!" మొదట గొంతునుపట్టి కనుక్కున్నాడు.... తరువాత కళ్లు తెరిచి సరిపోల్చుకున్నాడు.

వాడు బాగా తెలివికి వొచ్చాడని గ్రహించగానే వాడి ఘోరనేరం గుర్తుకొచ్చింది.

"ఆఁ. నేనేలే! నీభార్యకు ఎలావుందీ?"

డాక్టర్ విరగబడి నవ్వుతున్నాడు.

"నవ్వుతున్నావురా శాస్త్రీ? నాకు భార్యలేదని నవ్వకండి.... వొచ్చేవారంలో పెళ్ళిచేసుకుతీరుతాను!"

"చేసుకో.... వారానికొకసారి నిమోనియావొస్తుంది. మళ్లీ గొలుసుపాఠం గొలుసులాగే అందరికీ చెప్పవొచ్చు.... కాని యీసారి గొలుసుకథ నిజంగా జరిగేను!"

"వెధవ మూడొందలు . చందాలు వేశారో లేదో– శుభమాఅంటూ నేను పెళ్ళి చేసుకోబోతూవుంటే — నా భార్యకు (?) నిమోనియా రావాలనా మీరుకోరేది?.... నేను హాయిగా రోడ్డుమీద చల్లగాలికి పడుకునివుంటే నన్నెలా వెతికి పట్టుకున్నారూ ?"

"నిన్ను వెతికి పట్టుకోపోతే— ఆ చల్లగాలితో పాటు నీ శరీరంకూడా మంచుగడ్డలే చల్లబడేది. రోడ్డుమీద చల్లగాలే నీకు ఇష్టమైతే — తక్షణం నిన్ను ఎరుకొచ్చినచోట ఎరుకొచ్చినట్టే పడేసివొస్తా!" అన్నాను.

"కలలోకూడా గొలుసుకథ చెప్తూన్నట్టున్నాడు పాపం!" అన్నాడు డాక్టర్ పోయినడబ్బు పోనేపోయింది. ఇక

మిగిలిందీ, మేము చేయగలిగిందీ తలవాచేట్టు చివాట్లుపెట్టి కొంత మనశ్శాంతి పొందటమే !

"ఏడిశాలేవోయ్ ! బోడి మూడొందలకు నన్ను దూషించే అర్హత మీకు ఎక్కడిదోయ్ ? ఏదో యీరాత్రి ప్రమాదాల పాలుకాకుండా నన్ను రక్షించారు కనుక మిమ్ము క్షమించాను!.... పోతే మాటిమాటికీ 'గొలుసు' అని వాగుతున్నారు; అదేమంత చౌకపదార్థ మనుకున్నారా ? మీకు ఇచ్చిన గొలుసును మళ్ళీ కొంటేనే కాని నాదెబ్బ మీకు తెలియదు. ఉండండి—" అని జేబులోంచి ఒకబొత్తి కరెన్సీ నోట్లు తీశాడు. పచ్చకాగితాల్నిపట్టి నాలుగైదు వేలకు తక్కువకాని మొత్తం ఉన్నదని తెలుస్తూనేవుంది. మూడు పెద్దనోట్లు నామీదికీ, మూడు డాక్టర్ మీదికీ విసిరిపారేశాడు. వీడి ప్రజ్ఞను పూర్తిగా తెలుసుకోకుండానే వీణ్ని దూషించినందుకూ, ఇకముందు వీణ్నితిట్టే అవకాశాలన్నిటికీ నీళ్ళధార పట్టినందుకూ లోలోన నొచ్చుకున్నాను.

"ఇక మిగిలినదాంతో ఇరవై గొలుసులు కొంటాను. ఇరవైమంది పెళ్ళాలకు దిగేస్తాను.... బోడిక్లబ్బు. ఇదీ వొక క్లబ్బేనా ? పచ్చకాగితాలుపెట్టి పలాసు ఆడే మొగాడు ఒక్కడన్నా వున్నాడూ ? ఊళ్ళో పాపర్లందరూ ఇస్త్రీగుడ్డలు వేసుకొని తయారవగానే సరా ?— రెండురోజులు ఆటలో కూర్చుంటే ఏడు వేలు.... గుడ్లు మిటకరిస్తావేరా— ఇదుగో.... ఏడు వేలు.... నువ్వు ఏడుస్తున్నట్టున్నావే !"